# పశ్చాత్తాపము



బొడ్డపాటి ఆనందరావు.

B. A. (HONS.)

బెజవాడ:

ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1938

# నా మాట.



మన యాంధ్రమున నాటకములు లెక్కకు మిగిలియున్నవి. అందు సాంఘిక నాటకములు తక్కువ. అందునను, యిప్పటి పరిస్థితుల ననుసరించి వ్రాయబడినవి చాలాకొద్ది సాంఘికమని అత్తకోడళ్ళ పోట్లాట, సాని నుంచుకొనుట, త్రాగుట మొదలగు యితర విషయముల నాధారము చేసుకొని రచించిన నాటకము లనేకము లున్నవి గాని, ప్రదర్శన యోగ్యముగా, సంక్షిప్తముగాయిప్పటి కాలానుగుణ్యముగా రచింపబడిన నాటకములు పెక్కుం గానరావు

ఈనాటకమందలి కథావస్తువు, పాత్రలు, సంఘటనలు కేవలము స్వకపోల కల్పితములు. నాటకాంతమున యురిశిక్ష యొకింత స్వభావ విరుద్ధముగా నుండవచ్చును గాని, నాటకప్రదర్శనసమయమున రక్తికట్టుట కిటువంటి సంఘటనలు జొప్పక తప్పినదికాదు. కేవల ప్రదర్శన యోగ్యముగా, సాధ్యమైనంత స్వాభావికముగా నాటక ముండవలయునని యే నే నీరచనకు పూనుకొంటిని. నే నెంతవరకు కృతకృత్యుడ నైతినో పాఠకులే నిర్ణయింపవలెను. ఇందలి శంకరరావు మొదలగువారు మాట్లాడు యింగ్లీషు ముక్కలను అవసర మున్నంతవరకు ప్రక్కన తెనుగుతర్జుమా చేసితిని. విచారణ సమయమున న్యాయవాదుల వాదనయంతయు తర్జుమా చేయబడినది. నటులు సమయానుకూలముగా కేవలము యింగ్లీషునైనను, తెనుగు తర్జుమానైనను వచ్చిన చోటెల్ల నుపయోగించుకొన వచ్చును.

పద్యములు, పాటలు సందర్భాను సారముగా ప్రదర్శకులే చేర్చుకొందురని నా ప్రార్థన. మంచి కథపట్టు సమయము రాగయుక్తమగు పద్యముకన్న భావగర్భితమగు వచనము యెక్కువ రాణించి స్వాభావికముగా నుండునను నమ్మకముచే పద్యములకు నా రచనయందు తావొసంగక విడచితిని.

నాంది ప్రస్తావనలు పాడిన పాటయేకాబట్టి చర్వితచర్వణమున కొడంబడక నే రచింపలేదు. ఇందలిభాష కేవలము గ్రాంధికముగానో, గ్రామ్యముగానో గాక, సామాన్యవాడుక భాష నుపయోగించితిని.

నాటకమున సాధ్యమైనంత చిన్న రంగములను, రసముచెడి పోకుండ రచించి పాత్రలయొక్క మాటలను సాధ్యమైనంత చమత్కారముగా, భావయుక్తముగా నుంప ప్రయత్నించితిని. రంగములు, పాత్రలమాటలు మొదటినుండియు చాటభారత ములు త్రవ్వకొని, గంటలకొలది ప్రేక్షకుల విసిగించక, అందుకొన్ని పాత్రలకేమి

చేయవలెనో తోపక రంగౌచిత్యము చెడగొట్టకుండ, అవసరమైనంత సేపే, అర్థము చెడిపోకుండా, సంక్షేపముగా, సూటిగానుండవలయునని నాయాశయము. కథపట్టు చక్కగా, త్వరగా, చలాకిగా నడువవలయును. ఒక్కొక్క పాత్ర ఒక్కొక్క విషయము కొరకై యేర్పడి అనవసర పాత్రలుండక, కథకొక ఐక్యతయు, సంఘటనలకొక వింత శోభయు, నేర్పరుపవలయును. పాఠక మహాశయులు నాయీ ప్రథమ ప్రయత్నమును మన్నించి సాదరదృష్టితో చూచి తప్పులనొప్పులుగా గ్రహించి వారి యభిప్రాయాదులను, నాలోటుపాట్లను, దెలియ జేసిన సాధ్యమైనంత వరకు రాబోవు ముద్రణలలోను, రచనలలోను తప్పక సవరించెదను.

నన్నీ రచనకు ప్రోత్సహించిన నామిత్రులు మ। రా॥ రా॥ శ్రీ సింగరాజు కృష్ణమోహనరావు పంతులుగారికిని, నేవ్రాసినవన్నియు ఓపికతో శుద్ధప్రతివ్రాసి ముద్రణసమయమున ప్రతులను సరిచూచి, నాకమిత చేదోడు వాదోడుగానున్న నాసహకారి మ॥ రా॥ రా॥ శ్రీ పోలూరి వేంకటేశ్వరరావుగారికి, నా యీ నాటకమును అప్పుడప్పుడు పరికించి నాకత్యంత ప్రోత్సాహము నొసగిన మిత్రులకు, అభిమానులకు, తదితరులకు సహృదయ పూర్వక వందనము లర్పించుచున్నాను.

శాంతినిలయము, బెజవాడ.
3—2—38.

ఇట్లు,
బొడ్డపాటి ఆనందరావు.

# అంకితము.

నన్ను గని, పెంచి, పెద్దజేసి, విద్యాబుద్ధులు
చెప్పించి నాకొక వ్యక్తిత్వము నిచ్చి
నిరతము నా శ్రేయస్సునే కోరుచు నాకత్యంత
పూజనీయులును, ప్రేమాస్పదులును నగు,
నా తలిదండ్రులకు
నా యీ చిన్ని పొత్తమును

**అంకితము**

చేయుచున్నాడను.

బొడ్డపాటి ఆనందరావు.

# పశ్చాత్తాపము

## పాత్రలు.



గోవిందరావు — ఒక ధనవంతుడు

నారాయణరావు — కథానాయకుడు

ప్రసాదరావు — ఒక జమీన్దారు

శంకరరావు — బారిష్టరు; జమీన్దారు కొడుకు

వెంకటాద్రిమయ్య — జమీన్దారు గుమాస్తా

ఆంజనేయులు } పురజనులు
సుబ్బారావు }

రంగారావు, సత్యం, రాజు— శంకరరావు స్నేహితులు

కమల — గోవిందరావుగారి కుమార్తె

మహాలక్ష్మి — గోవిందరావుగారి భార్య

సుశీల — నారాయణరావు తల్లి



# పశ్చాత్తాపము.

## అంకము 1.





### రంగము 1.

గోవిందరావుగారి యిల్లు.

(గోవిందరావు కూర్చొని వార్తాపత్రిక చదువుకొనుచుండును)

మహాలక్ష్మి ప్రవేశము.

మహా—ఏమండోయి! యిలాచూడండి పొద్దస్తమానం పేపరిలా మొహాన్కి అడ్డంపెట్టుకొని కూర్చుంటె ఎలా? కాస్తయినా సంసారంగొడవ పట్టలేదే? ఎలా యీసంసారం యీదటమో నాకు తెలియడంలేదు.

గోవిం—(తనలో) అప్పుడే తెల్లారిందీ! యింకా యింతసేపు కొంప నిశ్శబ్దంగావుంది ఎందుకా అని అనుకొంటూనే యున్నా! (ప్రకాశము) ఒసేవ్! మనయింటిదగ్గర చదువుకుంటూండేవాడు చూడు, నారాయణరావ్ అనే కుర్రాడు నేను సిఫార్సుచేసి స్కాలర్‌షిప్పుకూడ యిప్పించాను. బి. యే. పాసయినాడు ఫస్టుక్లాసులో. చాలా అదృష్ట......

మహా—విన్నాం, వస్తుం దయ్యాగారి కొక సబ్‌కలెక్టరుద్యోగం. ఏంచదివితే నేంగాను. పూటకు టికాణాలేదు. ఆడిగ్రీతోగూడ చిప్ప చేతికొచ్చింది.

గోవిం—కుర్రాడు చాలా చురుకైనవాడు. తప్పకుండా తనపొట్ట పోషించుకొనుచు తనతల్లి కింత పెడతాడు. పాపం సుశీల చాలా కష్టా లనుభవించింది.

మహా—పేరుమట్టుకు గొప్పపేరు ఆహా! యింకేం ఆమె అదృష్టం పండింది. కొడుకో బి. య్యే అయిరి. యింకేం తక్కువ బంగారు వంట. అబ్బో! యీ ప్యాసయిన వాళ్ళందరికి వచ్చాయ్. ఈసకివస్తాయ్. మాజానకికంటె యెక్కువవాడా! యేమిటి?

గోవిం—ఓహో వారా! యం. ఏ ప్యాసయి, డాక్టరీతప్పి లా చదివి నాటకాలేసి, సినీమా డైరెక్టరుగా ప్రయత్నించి యిప్పుడు తానొక సోషలిస్టు నంటూ ఎర్రజండాపట్టుక తిరుగుచున్నాడు.

మహా—పోన్లెండి మావాళ్ళందరు వట్టి చవటలు. ఎందుకుపనికిరానివారు. "పొరుగింటి పుల్లకూర రుచి" (కమల ప్రవేశించును) ఆగొప్ప సుశీలనే అనుభవించనియ్యండి. నాకెందుకు.

కమ—అదేమిటే అమ్మా! మీరిద్దరిలా వివాదపడుతున్నారు. (అని నవ్వి) ఏమిటినాన్నా! అమ్మనెప్పు డిలా రెచ్చపెడతావ్.

గోవిం—సరే! యింకేం నీవొక తెవుగూడ తోడయ్యావ్, అగ్నికివాయువులాగ! యీ స్త్రీసామ్రాజ్యంలో మా వాక్స్వాతంత్ర్యానికి యావజ్జీవపు శిక్ష 124 A యిచ్చారన్నమాట.

మహా—యిదే వరస! వాడు ఆ సుశీలకొడుకు పరీక్ష ప్యాసయ్యాట్ట. మీనాన్న సంతోషిస్తున్నాట్ట.

కమ—(సంతోషముతో) మన నారా......అయితే ప్యాసయినాడన్నమాట. నేను సుశీలత్తనిచూచిరావాలి. వస్తా, (అని నిష్క్రమించును).

మహా—సరి తండ్రీకూతురూ యేకమయ్యారు. యిహ నామాట చూచేదెవరు? (అని చరచర లోనికి పోవును).

గోవిం—అబ్బా! (అనినిట్టూర్పు నిగిడ్చి, మరలపేపరు చదువుచుండగా తెరపడును).

## రంగము 2.

(నారాయణరావుయిల్లు. సమయం రాత్రి. చిన్నదీపము వెలుగుచుండును. నులక మంచముపై వ్యాధిగ్రస్తయైన సుశీల. ప్రక్కన నారాయణరావు)

నారా—అమ్మా వేళయింది మందుపుచ్చుకో వైద్యుడు నీకేం భయం లేదన్నాడు.

సుశీ—నాయనా నిజంగా నాకేం భయంలేదు. నీచేతుల్లో పోవడంకంటె కావల్సిందేముంది.

నారా—ఏమిటమ్మా యీ పిచ్చిమాటలు అలా అనుకోగూడదు. మన కష్టాలు గట్టెక్కాయ్. నేనుఫస్టుగా ప్యాసయ్యాను. మొగాణ్ణి, రెక్క లమ్ముకోని నాలుగు రాళ్ళు సంపాదించి, నీకింతపెట్ట నేనింత తింటా. మనం తప్పక మంచిరోజులు చూస్తాం.

సుశీ—బాబూ! చూడు. నాకు యేకోరికాలేదు. నీపెళ్ళొకటె చూడ లేదు. కానీ మనస్థితికి ఆకోర్కె తీరనిది. యిహ! నిన్ను నీవు పోషించుకునే ధైర్యం నీకు గలిగింది. దేవుడు యింతకాలం నన్నుంచింది యీసంతోషం చూపడానికే.

నారా—అమ్మా! ఆ కోర్కెగూడ త్వరలో తీరుస్తాను. నీ కోడల్ని మనుమలను చూచుకొంటూ యుందువుగాని మందు తాగమ్మా.

సుశీ—ఊహూ! అవసరంలేదు. నా అవసానం సమీపించింది. యిన్ని దినములనుండి నీదగ్గర దాచిన సంగతులు యిప్పుడే చెప్పెదను. తరువాత నిశ్చలంగా పోవచ్చును.

నారా—అమ్మా! నువ్వలా అంటుంటే నాకు చాలా గాబరాగా వుంది. నువ్వు నాకొరకైనా జీవించాలి.

సుశీ—వెఱ్ఱివాడా! మనచేతుల్లోవా చావు బతుకులు. చూడు నువ్వు శ్రీ రాజా ప్రసాదరావుగా రెన్నరుగుదువు గదూ!

నారా—ఏమి! యీ సందిగ్ధ మాటలు.

సుశీ—కాదు నేను అన్నియెఱిగియే మాటలాడు చున్నాను. వారు నీ తండ్రి. నేను వారి మొదటి భార్యను.

నారా—అసంభవము. ఆ జమీన్దారుగారా!

సుశీ—అవును.

నారా—అయిన మన యీ దరిద్రావస్థ?

సుశీ—విధి నాయనా. పురుషులు చంచలులు. వారికి నిలుకడలేదు. తన తాగుబోతుతనమును విషయలంపటత్వమునూ యేవగించితినను కోపము మనస్సున నుంచుకొని నీ సవతితల్లి చెప్పిన చాడీల మీద భరింపరాని నిందల మోపి, నీ తండ్రి నన్నును నెలబుట్టువైన నిన్నును వెళ్ళగొట్టెను. నేను ఎంతవేడుకొన్నను కరుణ గలుగలేదు. చివరకు చేయునదిలేక యిలా కాలం గడుపుకొను చున్నాను. నాసంగతి లోకమంతా మరిచింది. ఒకప్పుడు నేను ప్రశంసాపాత్రనైన జమీన్దారిణిని. యిప్పుడు ఒకదిక్కులేని దరిద్రురాలను ఏదోనిన్ను చూచుకొంటూ యింతకాలం గడిపాను.

నారా—అమ్మా! నాకెందు కిన్నాళ్ళు చెప్పలేదు. మనకీ పాకగతేమిటి యీకష్టమంతా ఎందుకు? పద! నీకు నెమ్మదించిన తరువాత వెళదాం. నేను మాట్లాడుతానులే!

సుశీ—అయ్యో! వెఱ్ఱి తండ్రీ! నీ కింకా యెందు కాశ! ఆయనేం ఎరగడనుకొంటూన్నావా? వెళ్ళి యేంలాభంలేదు. యిది పూర్వ జన్మ సుకృతము. బంగారు తూగుటుయ్యాలలో దివ్యభోగం అనుభవించవలసిన ఆగర్భశ్రీమంతుడవు. యిలా దరిద్ర మనుభవిస్తూ అష్టకష్టాలు పడకుండానే సరిపోయేది; కాస్త అదృష్ట ముంటే.

నారా—భగవంతుడు మనవైపు నున్నాడు. యీ కఠిన పరీక్షయందు మనం నెగ్గాలి. తరువాత మన జీవితాన్ని సంతోషంగా గడపొచ్చు. అమ్మా! యీ మందు తాగి చూడు. (చేయిపట్టుకొని) నే చెపితే వింవూ. (అనినోటమందుపోసి) కాస్సేపు కండ్లుమూసుకో. (అని దుప్పటి కప్పి దీపము చిన్నది చేయుచుండగా తెరపడును).

---

## రంగము 3

(ప్రసాదరావు జమీందారుగారియిల్లు. ఒకసోఫాలో కూర్చుండి పైపుపీల్చుచూ జమీందారుగారు; ప్రక్కన గుమస్తా వెంకటాద్రియ్యతో మాట్లాడుచుండును).

ప్రసాద—అయితే పొలం కస్తానన్నాడన్నమాట. మరిఒప్పుకో లేక పోయావా! అంతకన్న యేమొస్తుందీ.

వెంక—తమరలా తొందరపడకండి. వాడు చాలా బిగువుగా నున్నాడు. దాన్ని యేమెసిమిదొందలకో అంటకట్టాలని. వాడు అవుసరంలో నున్నాడు ఆ పొలం సరిహద్దులో వున్న మనంతప్ప ఎవరుకొన్నా నీటితగాదాలు వస్తాయి. మనం కాస్త ఓపికపట్టామంటే చవకగా కొట్టవచ్చు కాదూకూడదంటే నిమిషాలమీద డిక్రీపొంది కోర్టువేలంలో మరీ చవుకగా లాగెయ్యొచ్చు.

ప్రసాద—లెఖ్ఖైమైనా జమైందా? యీయేడు.

వెంక—మనకి రావలసిన 75 వేలలోను 27 వేలు దగ్గరదగ్గరగా జమైంది. కొద్దిరోజుల్లో ముప్పైపూర్తి చేయొచ్చనుకొంటా. జమైందానిలో 15 వేలు పడ్డక్రింద రాం షేటుకు పంపాను. 3 వేల పైచిల్లర మామూళ్ళకు మొదలైనవాటికి ఖర్చయ్యాయి. యీయేటి ఖర్చులకు మనం తప్పకుండా నోటురాయాలి.

ప్రసాద—ఖర్చెక్కువౌతుంది కాని రాబడి కనిపించడంలేదు. యీమధ్య శంకరం బారిష్టరుకు వెళ్ళినతరువాత మరీయెక్కువైంది ఖర్చు.

మొన్ననే 3 వేలు పంపమని వ్రాశాడు. త్వరగా యేలాగో సర్దు. (యింతలో నౌకరురాగా) ఏమోయ్.

నౌకరు—(వంగి దండమిడి ఒకచీటీ యిచ్చును. జమీన్దారుగారు ఆచీటి వెంకట్రామయ్య కివ్వగా వెంకట్రామయ్య "నారాయణరావ్ బి. యే. అని చదువును")

ప్రసాద—(తనలో) యిహ వీడుకూడ దాపరించాడు. సరి యేలాగో లాగు వదుల్చుకోవాలి. (ప్రకాశము నౌకరుతో) తీసికొనిరా. (నౌకరు నిష్క్రమించును. జమీన్దారు గ్లాసులో బ్రాందీ పోసుక త్రాగి క్రింద పెట్టుచుండగా నారాయణరావ్ ప్రవేశించి, తెల్లపోయి సమాళించుకొని నమస్కరించును).

ప్రసాద—(లక్ష్యములేకయే) ఏంపని? త్వరగా తెముల్చు. నాకుచాలా పనులున్నాయ్.

నారా—మీ...మా తల్లి చనిపోయినది. మిమ్మల్ని చాలా అడిగెను. నేను మీరు...

వెంక—నీ తల్లిసంగ తిక్క డెందుకయ్యా? వెధవచాపుకబుర్లా నువ్వూను. వారిదగ్గర కొచ్చినవాడవు యేకానో, అర్ధణో అడిగి పట్టుకెళ్ళక నీసంసార గొడవంతా వెళ్ళబోసుకోవడ మెందుకు?

నారా—అయ్యా! మీసలహా యిచ్చుట అనవసరం. మిమ్మల్ని అడిగినప్పుడు చెప్పండి.

వెంక—ఓహో! గుడ్డొచ్చి పిల్లనెక్కిరిచ్చినట్లు బి యే. ప్యాసయావనే మిటి భూమిమీ దెక్కడా ఆగటంలేదు. నీలాంటి బియ్యేలు పిలిస్తే 'కో' అంటే కోటిమంది కాచుకొని యున్నారు.

నారా—అయ్యా! తమకున్న గొప్ప హోదాకు నేను నిజముగా తక్కువే?

వెంక—ఏమోయ్! నీయెక్కువయేమిటి? యీరోజున తింటే రేపటి కెలా అనే స్థితిలోనున్నావ్. చాలుచాలు కట్టిపెట్టు. వారున్నా రనికానీ...

నారా—లేకపోతే!...

ప్రసా—ఎందుకీ అనవసరగొడవ. వెంకటాద్రిమయ్యా! అతనొచ్చిన పని చెప్పనీయ్.

నారా—(తనలో) వ్యవహారం యేమీ బాగాలేదు. అయినా కదిపి చూద్దాం. (ప్రకాశము) మాతల్లి మిమ్ములను పూర్వపు ప్రేమ మఱచి పోవద్దని...

ప్రసా—ప్రేమ! అదంతా నాకుతెలియదు. అబ్బాయీ! అవన్నీ వృత్తసంగతులు. నీమాటలు నేను నమ్మను.

నారా—(ఉద్రేకముగా) అయిన నాకిక్కడ ఆస్కారంలేదా? నీవు నాతండ్రివికావా? యిందతాతెలిసియూ యిట్లు నీవు భోగ భాగ్యములను అనుభవించుచుండి నేను దారిద్ర్య మనుభవించ వలసిందేనా? ఎందు కింతటి నిర్దయ? తండ్రీ! చూడు, యీ రక్తము నీదికాదా? నీగుండెలు నిన్ను బాధించుటలేదా? యిట్లు నన్ను తూలనాడుటకు నీమనస్సెవ్వుచున్నదా? తండ్రీ! తండ్రీ!! ఆహా! ఎన్నాళ్ళకు తండ్రీ యని నోరార అనగల్గితిని; నాతండ్రీ! (అని దగ్గరకుచేర ప్రసాదరావు చీత్కరించుకొని తన్నును.)

వెంక— భేష్! బలే మంచి నటుడు. అబ్బాయీ! నీకీ అవస్థ అంతా యెందుకు? నాటకాల్లో యేచంద్రమతి వేషమో వేస్తే పని కొస్తావ్.

ప్రసా—బాగా అన్నావ్. ఏమోయ్ కొత్త కొడకా! నిన్ను నేను ఎరుగను. నీమాటలు నేను నమ్మను. నాదగ్గరనుండి నీకేమీరాదు.

నారా—తండ్రీ! నీ విది మనఃపూర్వకముగా నంటివా? నేను నమ్మను. నీ శరీరభాగము నిట్లు త్రోసివుచ్చెదవని అనుకొనను.

వెంక—యింకా యెన్ని మాట్లనిపించుకోంటావోయ్. సిగ్గులేదూ ?

ప్రిసా—శభాష్. బలే అన్నావ్ !

నారా—యిది అంతయు నీవు నిశ్చల మనసుతో మనసార అనుచున్న మాటలేనా?

ప్రిసా—ఆహా ! తప్పకుండా ! నీతోనాకు వేళాకోళమా ? అబ్బాయి ! గొడవ చెయ్యకుండా అవతలి కెళ్ళు.

వెంక—లేకపోతే నేను చెయ్యి చేసుకోవాలసొస్తుంది.

నారా—ఆహా ! కాలము. యితడు మానవుడా ! మృత్యుదేవత. దేవతగాదు. మృత్యుదయ్యము. ఓ! నీతి! జాతి! అభిమానమూ దయలేని అమానుషుడా ! నిన్ను నాతండ్రి యనుకొనుట గూడ అవమానము. నీవు పాపాత్ముడవు. దయా విహీనుడవు, క్రూరుడవు. కన్నకుమారుని, కట్టుకొన్న భార్యను వెడలనడచిన రాతిగుండె కిరాతుని జేరబోవుట తప్పు నాది. యింక యిక్కడ వుండ వలసిన అవుసరం నాకులేదు. నీ మొహ మింక నేను చూడను. యింతవరకు నీతో మాట్లాడుటయే పాపము. జ్ఞాపక ముంచుకొనుము. నీవు చేసిన యీ మోసమునకు భగవంతునెదుట ఉత్తరవాదివై శిక్ష ననుభవింపక తప్పదు. ప్రపంచము చాలా విశాలమైనది. యేలాగోలాగున బ్రతుకవచ్చును. నారుపోసిన వాడు నీరుపోయును. యిక్కడ ఒక నిమిష ముండవలసిన అవసరం లేదు. నీకూ నాకూ యిదియే సరి. (అని వెళ్ళును.)

ప్రిసా—చాలా మాటలు నేర్చాడు మొత్తానికి.

వెంక—అయ్యా! మీరేమన్నా అంటారనుకొన్నా గాని, యే మాత్రం సెలవిచ్చినా వానిని అనవలసినవి నాల్గు దులిపి రోడ్డుమీాది కీడ్చేవాణ్ణి. (వినుట నభినయించి) అదిగో పదకొండు కొట్టుచున్నది. యివ్వాళ మన వాయిదా. వెళ్ళొస్తాను. (అని నమస్కరించి వెళ్ళుచుండ తెలుపడును).



# పశ్చాత్తాపము

## అంకము 2.

### రంగము 1.

(గోవిందరావుగారి యిల్లు. ఒక బల్లకడ్డ కాగితములు చూచుకొనుచు నారాయణరావు ప్రవేశము).

నారా—(స్వగతము) ఆహా! విధి ఎంతటి యద్భుతముగా పరిణమించెను! ఒక జమీన్దారు నింటపుట్టి సమస్త సౌఖ్య సౌభాగ్యముల ననుభవించవలసిన నేను, యిన్ని దినములు నా జన్మ నెఱుగక, నాతండ్రిని గుర్తెరుంగక పరమ దరిద్రావస్థ ననుభవించి, అనేక కష్టములకు లోనై యెట్టకేలకు పట్టభద్రుడనైతిని. ఆ సంతోషము పూర్తిగా ననుభవింపక ముందే, నా తల్లి! హా! గతించెను. యిన్ని దినములు తన విచారముతో అసహాయస్థితిలో లోకమనెడి బ్రహ్మరాక్షసిని నిరాధారనై, నిరాయుధనై, నిస్సహాయనై యెట్లెదుర్కొనెనో ఆ పరమాత్మునకే యెఱుక. చివరకు నాతండ్రి యునికి దెలియవచ్చెను. నన్నాత డెంతో ఆదరించు నను కొండంత ఆశతో అతనిని డాసి నోరార తండ్రీ! యని పిలిచి అతని బిగికౌగిలిలో చేరగల్గుదు నని యెంతో ఆశించితిని. కాని, భగవంతుని యాదేశము వేరు. నన్నాతడు నిందించి, తూలనాడి విసరికొట్టి ముష్టివానిని చీత్కరించి వెడల నడిపినట్లు వెళ్ళగొట్టెను. అట్టి స్థితియందు నామీద మొదటినుండి అత్యభిమానముతో వ్యవహరించిన గోవిందరావుగారి సాయమే లేకపోయిన నాగతి యేమైయుండునో! పరమాత్మునికెఱుక.

(తెరలో సంగీతము వినబడును (వినుట నభినయించి) యెచ్చటనుండి యీ సంగీతము? ఓహో! కమలవలె నున్నదే! నాకు

ఆమెను గాంచకున్న ఒక్కదినము గడచుటలేదు. ఎల్లవేళలను, ఆసుందరమూర్తి నాకంట కట్టినట్లుండును. యింతకు, నావంటి అభాగ్యునికి అంతటి సౌభాగ్యవతితో పరిణయమేమి? అయినను దైవసంకల్ప మెట్లున్నదో! (అని పోబోవుచుండ తెఱలో సంగీతము బాగా వినబడుచుండును. నారాయణరావు నిష్క్రమించును. తెఱయెత్తగా కమల కూర్చొని పాడుచుండును. నారాయణరావు ప్రవేశించును. కమల పాట ముగించిన తరువాత నారాయణరావును చూచి లేచి).

కమల—ఓహో! నారాయణరావుగారా! చిరకాలదర్శనము. పూర్వము కాస్త కంటికైన కనపడతూ ఉండేవారు. యిప్పుడు దగ్గరవడంచేత బొత్తిగా దర్శనములు లేవు

నారా—లేదు. కమలా! కొంచెము పనితొందర.

కమ—అయిన విశ్రాంతికి వేళలేదా?

నారా—లేకపోవుటకాదు. కాస్త యీమధ్యన మనస్సు బాగుండక పోవుటవలన.

కమ—అదేమి మనస్తాపమేల?

నారా—కమలా! యేమని చెప్పుదును? నేనిప్పు డేకాకిని. 'నా' అన్నవా రెవరునూ లేరు. నాకీ విశాలప్రపంచమున ప్రేమించువా రెవ్వరును కనబడుటలేదు.

కమ—యేమి? వింతగా మాట్లాడుచున్నారు. మీ మనస్సు నేడు సరిగా నున్నట్లులేదు. మీ మాటలు నాకెంతమాత్ర మర్థమగుట లేదు.

నారా—అర్థమగునట్లు చెప్పవలయునా? నాపై ఖరివలన నీకేమియు పొడగట్టుటలేదా?

కమ—(తల పంకించును)

నారా—కమలా! నిన్ను నేను ప్రేమించితిని. నీవు నాప్రేమను తిరస్క రింప పనుకొనెదను.

కమ—(తలవంచి యూరకుండును).

నారా—కమలా! కమలా!! యేమి నాప్రేమ నిరాకరించెదవా? నేను ప్రేమించుట నీ కిష్టములేదా? మాట్లాడవేమి? చెప్పుము. నన్ను రక్షింపుము. కమలా! నీవు నన్ను ప్రేమించుచుంటివా?

కమ—నా హృదయ మిదివరకే......

నారా—ఐన నే నాశవదలుకొన వలసినదేనా? కమలా! ఆ భాగ్య రాశి యెవరు?

కమ—మీ......రే...

నారా—(లేచి) కమలా! కమలా! నన్ను రక్షించితివి. యింక నీవు నాదానవు. నాదానవు గాదూ!

కమ—నా హృదయము యీవరకెన్నడో యర్పించితిని. కాని...

నారా—యేమి?

కమ—నా తల్లిదండ్రుల యనుమతి...

నారా—వారి యనుమతితో పనియేమి? మన యిద్దరిమనస్సులు కల సిన చాలదా?

కమ—అట్లుకాదు! మనమెంత నవనాగరికులమైనా, హిందువులము. మనసంఘము, మంచీ, చెడ్డా, ఆలోచించవలయును. యింతకూ నాకు విద్యాబుద్ధులు చెప్పించి, యిన్నిదినములు అల్లారుముద్దుగా పెంచి, యింతస్వేచ్ఛ నాకిచ్చిన నాతల్లిదండ్రులు తమ యేకైక పుత్రికకు కలనందైనను అన్యాయము చేయుదురా?

నారా—వా రొకవేళ వివాహమునకు అంగీకరింపకపోయిన...

కమ—అప్పుడు చూచెదము.

నారా—కమలా! నీయిష్టమే కానిమ్ము. అట్లడిగిన పిదపే నిన్ను చేపట్టెదను. యిక సెలవా? నన్ను మరచిపోకుము. కమలా! యిది నిజమా! కల కాదుగదా! నీవు నన్ను నిజముగా ప్రేమించుచుంటివా? నీవింక నాదానవు. కాదా! (తెరలో కమలా! కమలా! అని పిలుపు. కమల నిష్క్రమించును. తెలియపడును.)

---

రంగము 2.

(గోవిందరావుగారి తోట. ప్రవేశము కమల)

కమ—(తెరలో) ఆహా! మానవజన్మ మెంతకష్ట జీవనము! మనకిచ్చిన జ్ఞానమెంత అపాయకరము. ఏజంతువుగానో పుట్టిన యిన్నికష్టము లుండవుగదా! నే నితనిని మనసార వరించితిని. మాతల్లిదండ్రులను సంపూర్తిగా ప్రేమించితిని. మా ప్రణయము వారంగీకరింపక పోయిన కర్తవ్యమేమి? తల్లిదండ్రుల దోసివుచ్చి యితనిని అనుసరింతమన్న వారు చేసిన ద్రోహమేమి? జననమాదిగా నేటివరకు అఱచేతులలో పెంచి, కావలసినవన్నియు నిచ్చి అత్యనురాగముతో పెద్దను జేసిన నేను వారి కిమార్తెను. వారి శరీరమున నొకభాగమును. ఒకవేళ యివన్నియు సరకు గొనక మేమిర్వురము వెడలి పోయెదమన్న ముందు గతియేమి? నన్ను పోషించుటకు అతడు చాలా కష్టపడవలెను. నాభారము మిక్కిలి యెక్కువగును. ఒకప్పు డెంతకష్టపడినను లాభము లేకపోవచ్చును. ఒంటివాడైన యెట్లో కాలము గడుపుకొన వచ్చును. యిక నేను, పెన్నిధానమును త్రోసివుచ్చి పేదరికమును కట్టుకొనినట్లు తల్లిదండ్రులను ధిక్కరించినందులకు విచారించుచు నాకొఱ కలదుఃపడు వాళ్లుచూచి కుందుచూ ఉండవలయును. నా తలిదండ్రుల యాజ్ఞకు వ్యతిరేకముగా పోవుట నాకు తగదు. లోకము హర్షించదు. పలుగాకుల పలుకులు ములుకులై తీరని వ్యథ ననుభవింపవలసి వచ్చును.

నాకు మనశ్శాంతి యుండదు. అతడు సుఖపడడు. (యింతలో మెల్లగా అడుగులు వైచికొనుచు తల(వేలవైచి నారాయణరావ్ ప్రివేశము.) అడుగుల చప్పుడు విని కమల సంతోషముతో వెనుదిరిగి నారాయణరావు వాలకము చూచి అదరిపడి).

కమ—యీాదినమట్లుంటిరేల?

నారా—యేమియూ లేదు. నేను... యీాదినము మన వివాహమును గూర్చి, మీాతల్లి దండ్రిల...

కమల—వా రేమనిరి?

నారా—మీా తల్లిదండ్రిల నడిగితిని. మన యిర్వురిపేృమ చెప్పితిని.

కమ—పిదప.

నారా—వారు వినిరి. తరువాత...

కమ—అబ్బా! నన్నెంతసే పిట్లు సంధిగ్ధావస్థలోనుంచెదరు. పరిహాసమున కిది స్థలముకాదు.

నారా—వారు నిన్ను ఎంతపేృమతో పెంచినారో!......

కమ—కాయా! పండా! త్వరగాచెప్పండి.

నారా—ఏమని చెప్పుదును. నావంటి అభాగ్యునకు మీాతండ్రి యనుమతి నివ్వలేదు.

కమ—(మిన్నకుండి తలవంచి కాలు నేలరాయును).

నారా—నీతండ్రి నిన్ను ధనవిహీనునకివ్వడట. నా ప్రిస్తుతస్థితిలో నిన్నిచ్చుట కంగీకరింపలేదు.

కమ—అట్లయిన కర్తవ్యము...?

నారా—నన్ననుసరించుటయే. నేనిచ్చట నొకక్షణముండ, వలనుపడదు నీతండ్రిని చూచుటకు నాముఖ మింక చెల్లదు. నేను తగుధనము సంపాదించియే యాతనికి కనబడెదను. నన్ను నీవనుసరించిన

యెడల, మనమిరువురము సుఖముగా యేకల్లో, గంజో, కాచుకొని బ్రతుకగలము.

కమల—మరి మాతల్లిదండ్రుల మాట?

నారా—వారిని విడుచుటయే.

కమల—అసంభవము! నేనట్లు చేయజాలను. నాతలిదండ్రుల కెదురాడ లేను. ఐనను ప్రస్తుత స్థితియందు నేను నీకొక మోయలేని బరువుగా నుందును.

నారా—అట్లనకుము. ఆ రోజు రావలయుగాని సంతోషముగానిన్ను భరింతును.

కమల—నా తలిదండ్రులా, మిక్కిలి విచారించెదరు లోకమా, శతవిధముల దూషించి పలుమాట లాడును.

నారా—లోకులు పలుగాకులు. వారి లెక్కేమిటి? నిజమైన ప్రేమాను రాగ ముండవలయును.

కమల—లోకము నోరు మూకుళ్ళతో మూయలేము. మనము సంఘ మునందు నివసించుచున్నాము. ఆసంఘపు యేవగింపు భరింప రానిది. అందునను ఆడుదానికి అపకీర్తివచ్చిన ఆమచ్చ మాయదు. నేను నిన్ను మనసార ప్రేమించితిని. కాని సంఘ నియమములను, నాతలి దండ్రులను అతిక్రమింప నశక్తను.

నారా—కమలా ! కమలా !! మన ప్రేమను మరచిపోకుము. యేమి నీవెఱ్ఱి ? నిశ్చలమైన ప్రేమముం దీయడ్డంకు లేపాటివి ? రమ్మ. నాయొక్క భావిభాగ్యాన్వేషణమున భాగస్వామిగా నుందువు. నా కమలా ! నా ప్రేమను గౌరవించి రమ్మ. "నన్ను ప్రేమిం చితి" నంటివే ?

కమల—నేను నిశ్చయముగా మనసార ప్రేమించితిని. నామనము నిన్ను నుసరింపమని ప్రోత్సహించుచున్నది. ఐనను నే రాజాలను.

నారా—కమలా! నావెంట రావా? "నాదాన" వంటివే?

కమల—(విచారముతో) రాజాలను.

నారా—ముమ్మాటికి?

కమల—(అనంగీకార సూచకముగా తలపంకించును.)

నారా—సరియే. నాకింక శెలవొసంగుము. నాకింక లోకమే లేదు! జీవము లేదు! సంతోషము లేదు! వెలుగు లేదు! నాజీవిత మింక నిరర్థకము! దుర్భరము! దుస్సహము! దుఃఖమయము! ప్రియ త్నించెద, నా రక్తమాంసము లన్నియు వినియోగించి ధనము సంపాదింప. అట్లు సంపాదించియే నీపాణిని గ్రహించెదను. అంతదనుక, యిదియే ఆఖరు సమావేశము. అదృష్ట మున్న యెడల మరల కలుసుకొనుట; లేకున్న

కమల—లేకున్న?...

నారా—యింతటితో సరి.

కమల—హా! యెంతటి తీవ్రపరీక్ష. భగవంతుడా! శక్తి నిమ్ము. యీ సమయమున నా కేమియు పాలుపోకున్నది.

నారా—కమలా! విచారింపకుము. నేను పోయివచ్చెదను. నీకు శుభ మగుగాక! యేది యెట్లైనను నిన్నొకానొకప్పుడు ఒక అభా గ్యుడు మనసార ప్రేమించెననియు, అతని ప్రేమసౌధము అకా రణముగా, అన్యాయముగా, భగ్నమొనర్ప బడెననియు; ఆప్రే మాగ్నియే యతని హృదయమున యెప్పటికి చల్లారక రవులు కొనుచుండుననియు, అతడు నిన్నుతప్ప యింకొకరిని యెన్నడు ప్రేమింపడనియు జ్ఞాపక ముంచుకొనుము.

కమల—నీమాటలు నా గుండియలు పగులగొట్టుచున్నవి. వీనిని వినుట కంటె తెగితెగని కత్తితో శిరశ్ఛేదము చేయించుకొనుటయే మేలు. అబ్బా ఎటువంటిమాట వినవలసివచ్చెను.

నారా—యిచ్చట నేనున్న యిరువురకును కష్టమే. నేనింక పోయెదను. శలవు నిమ్ము. నీతల్లిదండ్రులకు నా వందనములు. నీకు శుభము. అదృష్టమున్నయెడల అంతదనుక...

(నిష్క్రమించును)

కమల—పోయెదవా! పోయెదవా!! ఆగుము. (అని వెంటాడ బోవుచుండ తెఱవడును).



# పశ్చాత్తాపము.

## అంకము. 3

### రంగము. 1

(ప్రసాదరావు జమీన్దారుగారి యిల్లు. ప్రసాదరావుగారు, పాశ్చాత్య దుస్తులతో కొడుకు శంకరరావు కూర్చొని మాటలాడుచుందురు.)

ప్రసాద—అట్లయిన I. C. S. (ఐ సి. యస్.)లో వెళ్ళిన మనవాళ్ళందరూ తప్పిపోయారన్నమాట.

శంక—Yes. (యస్) నేను బారిష్టరుమీద Concentrate (కాన్సన్‌ట్రేట్) చేశానుకాబట్టి Easy (యీజీ) గా Succeed (సక్సీడు) అయ్యాను. I am a lucky fellow (నేనుచాలా అదృష్టవంతుణ్ణి.)

ప్రసా—మొత్తానికి యిన్నిదినములకు యింటికి వచ్చావు. యిక నువ్విక్కడే ప్రాక్టీస్ పెడితే బాగా...

శంక—Damn it (డామిట్) Bloody private practice (వెధవ ప్రైవేటు ప్రాక్టీసు) ఎవరి క్కావాలి. నాకు సబ్జడ్జి సెలెక్షన్సులో ఛాన్సు వుంది. I must exploit it at first (అసంగతేదో తేల్చుకోవాలి.)

ప్రసా—యేదోకాస్త, వున్నవాళ్ళంగనక, అన్నివ్యవహారాలు చూస్తూ, నువ్విక్కడే వుంటే...

శంక—My Lord. (మైలార్డ్)What a Conservative temperment! (ఎంతఛాదస్తం) నాకు నీతో డిస్ కస్ చేయటం తలకాయ చాలానొప్పిగా వుంది. I have no time. (నాకు టైము లేదు.)

గోవిందరావు ప్రవేశము శంకరరావు లేచి Shake-hand (సేక్ హాండ్) యిచ్చి కుర్చీ చూపించి కూర్చొనిన తరువాత జేబు నుండి సిగరెట్ కేసు తీసి గోవిందరావుకి వ్వబోగా అతడు నిరాక రించును. తండ్రి కివ్వబోగా అతడు నివారించును. శంకరరావు నిర్లక్ష్యముగా Sorry I can't help it (అనుకొని సిగరెట్టు ముట్టించును.)

గోవింద—(నాటుచుట్టతీసి వెలిగింపబోవుచుండ)

శంక—(తనలో) What a nasty Company?

గోవింద—ఆ, మఱి సీమసంగతు లేమిటి?

శంక—O My Lord! (ఓమైలార్డ్) I am not a newspaper (నేను న్యూస్ పేపరుగాను.) (అనుకొని ప్రకాశము) యేమీలేవు.

గోవింద—అయితే అక్కడ పత్తిధర యెలావుంది? గోధుమలకు డిమాండు జాస్తిగావుంది. అనుకుంటా! మఱి చైనా జపాన్ యుద్ధంసం గతి యింగ్లండులో యేమను కొంటున్నారు? బంగారంధర యే మన్నా తగ్గుతుందా?

శంకర—(తనలో)This fellow thinks I am some informa tion Bullittin (వీడు యీాభోగట్టా అంతా నన్నడిగితే) (ప్రకాశము) నా కవేమీ తెలియవ్.

గోవింద—మఱి యింతేనా నీ బారిష్టరు చదువు?

శంకర—My dear man (మైడియ్యర్ మాన్) బారిష్టరంటే వడ్డీ వ్యాపారంగాదు. మార్కెటు లెఖ్ఖలుగావు. న్యూసుపేపరుగాదు. That's not our concern.(వాట్లతో మాకు సంబంధము లేదు.)

గోవింద—శాస్త్ర లోకజ్ఞానానికన్నా....

శంక—We can't bother our selyes with such Nonsense (వాట్లతోటి మేం పెట్టుక కూచోము) Its beneath our dignity (అవి మాడిగ్నిటీకి లోపము).

గోవింద—సరే కాని నీవివాహ మెప్పుడు?

శంక—(తనలో) Now you have turned your head to the art of Match-making eh! (యింకా పెళ్ళి సంగతి వీడు మె త్తలే దెందుకా అనుకొంటూన్నా).

గోవిం—యేమిటీ? ఆలోచన? భావగారూ! ఊరుకున్నారేం?

ప్రిసా—(తనలో) అప్పుడే భావగారు అని కలిపాడే (ప్రకాశము) అబ్బే! యేదో మావాడి తాహతుకు తగిన సంబంధం దొరికినప్పుడు...

శంక—(తనలో) I see Now this old bug is after Dowry (ముసలా డప్పుడే కట్నం పేచీ వేశాడు.) (ప్రకాశము) కాదు. నాకిష్టమైన పిల్ల దొరికినప్పుడు.

ప్రిసా—ఆమెకు తగిన స్థితిగతులు లేకపోయిన...

శంక—Doesn't matter (ఫరవాలేదు) నాకు నచ్చితే చాలు.

ప్రిసా—నా కిష్టము లేకపోయిన...

శంక—I don't care (ఐ డోన్ట్ కేర్) పెళ్ళిచేసుకునేద నేను.

గోవిం—(తనలో) యింతవరకొచ్చిందీ! (ప్రకాశము) అయితే నీయిష్టమన్న మాట.

శంక— Ofcourse. (తప్పకుండా) Why not? (వై నాట్?)

గోవిం—సరే, ఆవిషయం యిప్పుడెందుకు? సమయ మొచ్చినప్పుడు చూసుకొందాం. అయితే శంకరం- నువ్వు...మాయింటికి రేపు శనివారం విందుకి తప్పకుండా రావాలి. తప్పదు.

శంక—Oh ! I don't relish the idea (నాకు వీలులేదు)

ప్రసా—నువ్వు అలా అనకూడదు. వారు మనకు కావలసిన వారు.

శంక—I say! I know my responsibilities at least (నా మంచిచెడ్డలు నాకు తెలుసు) నాకుఅక్కడ కంపెనీ నచ్చదు. All old fellows (అంతా ముసలాళ్ళు) I hate them (నాకు వాళ్ళంటే పడదు.)

ప్రసా—అబ్బే ఆభయం వద్దు. వారి కమల యిప్పటి నాగరికత...

శంక—Who is this KAMALA? (హూ యీజ్ దిస్ కమల?)

గోవిం—మా అమ్మాయ్.

శంక—(తనలో) Let us see! (కొంచె మాలోచించవలసిన విషయమే.) (ప్రకాశము) సరే మీరిలా చెపుతున్నారు గనక I shall try (రావడానికి ప్రయత్నిస్తాను.) అయినా చెప్పలేను.

గోవిం—అలా కాదు. తప్పకుండా రావాలి.

శంక—I shall see (చూస్తాను లెండి) నాకు క్లబ్బుకు వేళయింది. వెళ్ళాలి. మీరిద్దరు మాట్లాడుతుండండి Cheerio (వస్తా అని వెళ్ళుచుండ తెలుపదును).



రంగము. 2

(కాఫీహోటలు వద్ద ప్రవేశము. వెంకటాద్రిమయ్య, సుబ్బారావు, ఆంజనేయులు.)

సుబ్బా—అంతవరకొచ్చిందీ! అబ్బాయిపని.

ఆంజ—మరింకేమిటి? యింగ్లండుకూడ వెళ్ళివచ్చాడ్తే రి.

వెంక—అంతటితో సరా ! ఆ షికార్లేమిటి? ఆ సమావేశా లేమిటి? ఆ ముచ్చట లేమిటి? హరిహరీ ! తల్చుకుంటే నాలాంటివాడికే తల

కాయమెత్తుకొని తిరగడానికి వీలులేకుండా వుంది. గోవిందరావు గారు యెలా భరిస్తున్నారో?

సుబ్బా—యింతకీ, గుఱ్ఱాన్ని పెంచినట్లు, పెండ్లి పెటాకులు లేకుండా, ఆడదాన్ని పెంచితే యేమౌతుందీ?

ఆంజ—యీ నాగరికత ఒకటి, మధ్యలో. అందులో ఆడదాన్ని విచ్చలవిడిగా అందరితోడి తిరగనియ్యడమే? మత్తేమైతుంది?

సుబ్బా—మీ శంకరరావు గనక సరిపోయింది. నేనైతేనా!

వెంక—అతనికిమట్టుకు యేమిలోపం? మనకన్నా నాలుగు ఆకు లెక్కువ చదివాడు. పదిరకాలెక్కువ చూశాడు.

ఆంజ—అంతవరకూ వచ్చిందన్నమాట.

వెంక—ఆహా! సందేహమెందుకు? యిహ మన బ్రాహ్మణజన్మ గతులేకుండా పోతుంది. శంకరాచార్లులో జెప్పి డొక్క బ్రద్దలు గొట్టించ గలనుగాని...

సుబ్బా—నువ్వు శంకరాచార్లగారి యేజంటువు. నీకేమి భయమోయ్.

వెంక—దానికి కాదోయి. డబ్బుముడ్డిలోవున్నాడు దేవుడు.

సుబ్బా—అదికాదు. మన వెంకట్రామయ్యకీని, ఆ పూటకూళ్ళిట్టిందే బోడిది, రంగమ్మ దానికీని వున్న...

వెంక—మూస్కోవోయ్. మనలో పతిత్తు యెవడిక్కడ?

ఆంజ—అయితే కమలా బారిష్టరుగార్లు యింకెన్నాళ్ళు యిలా పెళ్ళి చేసుకోకుండా కాలం గడుపుతారు?

వెంక—రంకుసాగితే పెళ్ళెందుకన్నారు పెద్దలు.

ఆంజ—భేష్. నీకొక శిష్యుడు తయారయ్యాడు, క్రొత్త సూత్రాల ననుసరించడాన్కి. ఆ శంకరాచార్యులగారిని ఆశ్రయించి ఆ సూత్రం

శా స్త్ర మనుస్మృతిలో యెక్కించావంటేనా, నీపేరు జెప్పుకొని చాలామంది బ్రతుకుతారు.

సుబ్బా—అభాగ్యం నాకైనా పట్టిందికాదు. నిరుద్యోగ సమస్య సులభంగా పరిష్కార మయ్యేది.

ఆంజ—నిన్ను రానీకేం. ఆయనకు డబ్బున్నవాళ్ళుతప్ప పనికిరారు. ఆయనకు డబ్బే ముఖ్యం. అందులో ఈకొత్తగా పెట్టిన ఋణవిమోచన చట్టంవల్ల, బాగా దెబ్బతిని యున్నాడు. అల్లుడైనా డబ్బున్న వాడయితే, గోవిందరావుగారు శాంతిస్తారు. ఆయన వ్యవహారాలైనా చూసి, శా స్త్ర కమీషన్ కొట్టచ్చునని.

సుబ్బా—బిల్లంటే జ్ఞాపక మొచ్చింది. దీనివల్ల మీ జమీన్ దారు గార్కి బాగా లాభ మనుకొంటా.

వెంక—ఆహా! మొదట్లో అలాగే భేష్ అనుకొన్నాం. కాని దరిమిలాని మాకు రావలసిన శిస్తులు తుడిచిపెట్టుక పోయాయ్. పాత బకాయీలను ఆధారం చేసుకొని యున్నాళ్లు లాక్కొస్తూన్నామ్. మాకు రావలసినవన్నీ చాలామట్టుకు నున్నా జుట్టాయ్. ఋణదాతలు వ్యాజ్యాలు బనాయిస్తూన్నారు. డిక్రీ లవుతాయ్. అప్పటిగతి? యెక్కడా అప్పనేది పుట్టదు.

ఆంజ—బ్యాంకు లున్నాయిగా?

సుబ్బా—చూడు ఈమధ్య కోపరేటివు క్రెడిట్లు అన్నారే, అదేమైనా లాభిస్తుందా?

వెంక—బ్యాంకులు! బ్యాంకులు! కోపరేటివు ఆఫీసులు. అంతా పేరు గొప్ప ఊరుదిబ్బ. వారి కీవ్యాపారం యేమితెలుసు? ఉన్న డబ్బెంత? అందులో శ్రీరామచంద్ర! వారిచుట్టూ యెన్నిసార్లు తిరగాలి. యెన్ని కాగితాలమీద తెలిసితెలియక దస్కతులు పెట్టాలి. యిందులో యెన్ని అనుమానాలు? చెక్కుమీద అంకె

వేస్తే పక్కన గుమస్తాగాడు అంకెలు దిద్దుతాడేమోనని అనుమానాలెన్ని. యింతాజేసి యింతా తిరిగితే అప్పు పుట్టక పోవచ్చు. వారివ్వమని చెప్పరు; యివ్వలేమని బయటపడరు. మనం తిరిగి, విసికి, వేసారి, పూరుకోవాలి.

సుబ్బా—యింతకూ బిల్లువల్ల రైతులు బాగుపడతా రనుకొంటా!

వెంక—ఆహా! నిస్సందేహంగా! చూస్తాంగా. నాకు కోర్టు వేళయింది వెళ్ళాలి (అని నిష్క్రమించును).

సుబ్బా—బ్రదర్ సిగరెట్టుందా! (అని ఆంజనేయులు జేబులో Gold Flake ప్యాకెట్టులో వున్న 1 డక్కా సిగరెట్టుతీసి యిద్దరు చెరిసగం తుంచి ముట్టించిన తరువాత) బ్రదర్ నేను ఆదారి నిరాను. ఆ కోట్లో బాకి; ఆ వీధినే యింటద్దెకూడ యెగేశా నో పాతిక; యిప్పుడలా వెడితే మర్యాద దక్కదు.

ఆంజ—సరేలే బ్రదర్ చిక్కు లెవరికి లేవు. నాకూ యిటేపనుంది Travellers బంగళాలో మా డైరెక్టరు "Ram" గారు దిగారు. పాపం మన కనకాన్ని తీసికెళ్ళి చూపించాలి; చాలా సరదా పడుతూంది సినిమాలో కెళ్ళాలని

సుబ్బా—వీలయితే నాకో ఛాన్సుచూడు; అంతాకలసి వెడదామ్; (అని యిరువురును నిష్క్రమించుచుండ తెలుపడును).

---

## రంగము 3.

(గోవిందరావుగారి తోటలో సంగీతము పాడుచు కమల.)

తెరలో అమ్మా! బారిష్టరుగారు వచ్చారు.

కమల—(కొంచెమాలోచించి) రమ్మను. (స్వగతము) యితనిప్రవర్తన వింతగా నున్నది. ఆలోచించి చూచిన యేదో దురుద్దేశమున్నట్లు కనబడుచున్నది. యిట్టివారితో పరిచయము తప్పు. ఎంత త్వరలో

వదల్చుకొనిన అంతమంచిది (అనుకొనుచుండ శంకరరావు ప్రవేశము.)

శంకర—Hallo Kamala (హాలో! కమల!) యివా ళిలావున్నా వేమిటి?

కమల—అబ్బే యేంలేదు. కాస్త తలకాయ నొప్పిగావుంది.

శంకర—కొంచెం కార్లో షికారు వెడదాం. అన్నీ తగ్గుతాయి.

కమల—క్షమించండి నాకు వీలులేదు.

శంకర—Why not (వై నాట్) నువ్వు తప్పకరావాలి. I will not leave you here like this (నేను నిన్నిలావదలిపెట్టను).

కమల—మీతో రావడానికి నాకు మనస్పొప్పడంలేదు.

శంకర—కమలా! నన్నిలా కష్టపెట్టడం నీకు న్యాయమా?

కమల—మీకెందుకూ కష్టం?

శంకర—Because I love you (నేను నిన్ను ప్రేమించాను) కాబట్టి రా! నాకమలా! యిలారా! చూడు! యేదీ ముద్దు...

కమల—శంకరరావుగారూ! మీరు చాలా పొరబడుతున్నారు. తమరు దయచేసి యిలా మాట్లాడవద్దని ప్రార్థిస్తూన్నాను.

శంకర—Dammit (డామిట్) I know it all (నాకదంతా తెలుసు) యీసిగ్గంతా యెందుకు? నాకు తెలుసు మీ ఆడవాళ్ళ సంగతి. మనసులో ఎంతయిష్టముంటే అంత బెట్టుగా కనిపిస్తారు (అని దగ్గరకు రాబోవ కమల దూరముగా జరుగగా) Cut it out! (కాస్త ఆవు నీవేషం) నేను చాలా గరల్సుని చూశాను. Don't think too much of yourself (నీ యొక్క వేమిటి?) యేదో కాస్త హాపీగా టైం స్పెండ్ చేద్దా మంటూంటే...

కమల—అయ్యా! తమరు దారితప్పి వచ్చారు. యిది వేశ్యాగృహము కాదు. యీకాలమున వేశ్యలయందే పడుపువృత్తి నశించి వారు యిష్టాయిష్టముల నెఱవేర్చుకొనుచున్నారు. ఆడుదనిన యొక భోగవస్తు వనుకొనుచున్నారా? కనపడ్డవారి నందరిని సంతోష పెట్టడం మాపనికాదు. స్త్రీకికూడ ఉచ్చము, నీచము, జ్ఞానము ఆలోచన, యుక్తాయుక్తము, నీతి, జాతి వున్నాయి. కాస్త చను విచ్చి యెదుటపడి ధారాళముగా మాట్లాడినంతనే, పురుషుడు స్త్రీని కామించును. ఆమెమాటలు, చేతలు, [illegible]పులు యెంత అమాయకముగానున్ననూ, పురుషులు వాటియందుండి తమకను వగు వింత యర్థములు దీసి అవి యన్నియు ప్రణయసూచ[illegible]ను నమ్మకముతో అడ్డగోలుగా ప్రవర్తించెదరు. పురుషులు చాలా మంది వగుస, వాపి, యుగధర్మము అన్నీమఱచి స్త్రీలను బల వంత పెట్టుదరు. స్త్రీని చెడుపువారు పురుషులు. చెడినదని స్త్రీని రచ్చకీడ్చువారు పురుషులు. రచ్చకీడ్చి నిలువనీడలేక వెళ్ళగొట్టువారు పురుషులు. అట్లు వెళ్ళగొట్టబడిన స్త్రీయొక్క అసహాయస్థితిని లోకువచేసుకొని కామముతో వంచించి ఆమెను పడుపువృత్తిలోనికి దింపి నాశనముచేయువారు పురుషులు. మిమ్ముల నేనేమియు ననుటలేను. పెద్దపెద్ద పరీక్షలిచ్చి, దేశ దేశములు తిరిగినవారికే యిట్టి దురభిప్రాయములు వదలనిచో యింక సామాన్యుల మాటయేమి?...

శంకర—Look here (యిలాచూడు) I am not a public audience (యిదొక మహాసభ కాదు) నీ లెక్చెరు కట్టిపెట్టు. నీ సంగతింతా నాకు తెలుసు. Don't try to deceive me (నాకే వేస్తున్నావే యీటోపి)

కమల—అయ్యా! శంకరరావుగారూ! తమరు మెల్లగాచెప్పిన తెలుసు కొన లేరు. మీ ప్రవర్తన, మాటలు, మర్యాద నతిక్రమించి

నీతి విరుద్ధముగా నున్నవి. మీరిచ్చట ఆగనక్కరలేదు. దయ చేసి వెళ్ళండి.

శంకర—ఓహో! పరేకాని నాకన్న మంచివాణ్ణి యెక్కడ సంపాదిస్తావ్? చూడు Don't be a fool (వెఱ్ఱిదాని లా వున్నావే) అయినా నీకునచ్చిన వాణ్ణి నీ యిష్టం వచ్చినప్పుడే పెళ్ళిచేసుకొందువుగాని; But that does not prevent you from having a happy time with me here any-way (యిప్పుడు కాస్త సరదాగా కాలం వెళ్ళబుచ్చుకోవడానికి అడ్డేది?)

కమల—మీకింక చెప్పిన తెలియదు. తెలుసుకోవడం అంతకన్నా యిష్టంలేదు. మీరు వెళ్ళరు. నలుగురిని పిలిచినచో నాకే చెడ్డ పేరు. యింతవరకూ రానిచ్చుట తప్పు నాది. యిక యిచ్చట ఒక్కనిమిష ముండుట నాకు మర్యాదగాదు. యింకెప్పుడూ యిలాంటి అప్రస్తుత ప్రసంశ లేవతీయకుండ మీ అసభ్యత ప్రేమను యే చెట్టుకో గుట్టకో మనసార వప్పగించి మీయిష్టం వచ్చినప్పుడే వెళ్ళండి (అని నిష్క్రమించును).

శంకర—సిల్లీఫూల్. అబ్బే! మనవాళ్ళకి బొత్తిగా మ్యానర్సు తెలియవ్. యిదే గనక వెస్టయితేనా! ఓ మైలార్డ్! ఎంత ఆనందం! యిందుకనే మనవాళ్ళిలా వున్నారు. వీళ్ళకి ప్రొగ్రెస్ రమ్మంటే యెలా వస్తుంది? యే Country (దేశము) అయినా దాని Legs మీద అది Stand అయి (స్వయం. శక్తిమీద) పైకి రావాలంటే such thing should not be encouraged (యిలాంటి వేషాలు కట్టిపెట్టాలి) ఆ కల్చరు, ఆ సొసైటీ, ఆ మానర్సు, ఆలైఫు, యేమున్నా! అబ్బా! మనవాళ్ళ కెంతుకబ్బుతాయ్. అబ్బే వుత్త బ్రూట్సు. అయినా యీ కమలను

తల తిప్పుడు జాస్తి I will teach her a lesson (దీనిపని పట్టిస్తా) యిది ఎవణ్ణి పెండ్లిచేసుకుంటే వాణ్ణి Ruin (నాశనం) చేస్తా. దీని life, hell (బతుకు నాశనం) చేస్తా. చూపిస్తా నా తడాఖా! నాకు కోపం తెప్పించి బతకాలంటే It's quiet impossible (వీలులేదు) (అని పోబోవుచుండ తెఱపడును.



# పశ్చాత్తాపము

## అంకము 4.

### రంగము 1.

(గోవిందరావుగారి యిల్లు మహలక్ష్మి, గోవిందరావుగారు, కమలా కూర్చొని యుందురు. గోవిందరావు ఒకఉత్తరము పఠించుచుండును. బల్లపై కాఫీపాత్రి యుండును.)

గోవిం—(చదువును) "యింతడబ్బు ఆర్జించిన తరువాత నేను కమలను వివాహమాడ కోరి మరిలమిమ్ము అడుగదలచినాను. దైవాను గ్రహామువల్ల మంచిరోజులగుటవల్ల భగవంతుడు నాప్రేమను మన్నించుటవల్ల ధనము యిట్లు సంపాదించగలిగినాను" (తనలో) చాలా పట్టుదల మనిషి. మొత్తాన్కి అనుకొన్నంతా నెగ్గించు కొన్నాడు. "నేను కొద్దికాలములోనే మిమ్ము కలసికొందును. అప్పుడు నాయొక్క కోరిక మీరు తప్పక మన్నించెదరని నమ్ముతున్నాను. మీకు నానమస్కారములు. యింతేసంగతులు. ప్రియమైన నారాయణరావు" ప్రేమంటే యిలావుండాలి. (తనలో)

మహా—మన శంకరరావుకన్నా యెక్కువా? జమీందారుకొడుకు, ధనవంతుడు. బారిష్టరు రేపో నేడో గొప్ప ఉద్యోగంకూడ రాబోతుంది. అతని కేం తక్కువ.

కమ—బుద్ధి...

మహా—తెలివితక్కువ. చిన్నపిల్లలు చిన్న అందంలేదు.

గోవిం—కమలమట్టుకు చిన్నపిల్లా! తన మంచిచెడ్డలు నిర్ణయించుకో లేదూ!

మహా—ఆహా! పుట్టినప్పటినుండీ ఆమే నిర్ణయించుకొంటూంది. యిహ ముందుకూడ అంతే! నాకెందుకు లేండి మధ్యలో. (అని మూతి త్రిప్పుకొనును.)

గోవిం—ఏమన్నా అంటే బిగుసుకొంటావు. అలాఅని పూరుకోవు.

కమ—ఉత్తరంవచ్చి యెన్నిరోజులయింది నాన్నా?

గోవిం—నాలుగు రోజులయింది. బహుశ అతడు త్వరలో రావచ్చును. అయితే ఆసంగతేం జెప్పమన్నావు, నీకిష్టమేనా?

కమ—(తలవంచి) మీాయిష్టం.

గోవిం—ఆలాగాదమ్మా నీవు వయసు వచ్చినదానవు. యుక్తాయుక్తాలు తెలిసినదానవు. తరువాత మమ్మల్ని బ్రతికున్నన్నినాళ్ళు తిట్ట డంకంటే, యిష్టాయిష్టాలు యిప్పుడే నిర్ణయించడం మంచిది. చెప్పు నీ కిష్టమోకాదో!

కమ—(మిన్నకుండును.)

గోవిం—చెప్పమ్మా! మటి.

మహా—యిష్టంగాకేం. లేకపోతే యింత మెత్తదనం కూడానా! గుడ్లు పీకెయ్యదు.

కమ—పో అమ్మా! ఎప్పుడూ యింతే.

మహా—అవునమ్మా! అందరికి కానిదాన్ని నేనే. పోనీవే అయితే; చూడండి! దాని కిష్టం లేదట.

కమ—నే నలా అన్నానా?

గోవిం—చెప్పమ్మా నీ యభిప్రాయం. నీనోట్లోనించి ముచ్చటగా వింటాం. నీవల్లే గాదమ్మా మాకింత సంతోషం.

కమ—మీాయిష్ట మేలా అయితే అలా!

గోవిం—అదేం మాట! అయినా నాకు నీవు నారాయణరావును పెండ్లి చేసుకోవడమే యిష్టం. చిన్నప్పటినుంచీ యెరిగినవాడు; బుద్ధి

మంతుడు; నిన్ను బాగా ప్రేమించాడు, ధనలోపం లేదు; నా కన్నివిధాల నచ్చాడు. యిహ నీసంగతి జెప్పు?

కమ—నాకూ యిష్టమే (అని చరచరలోనికి పారిపోవును).

మహా—అబ్బో యింతోటి మొగుడూ! ఎంతసిగ్గే!

గోవిం—పాపం! చిన్నపిల్ల. యికమనం పెళ్ళిపెత్తనాలమీద వుండాలి. త్వరగా పనులన్ని జరగాలి. ఒరేయి యెవరక్కడ?

(తెరలో) అయ్యా!

చూడు, వెళ్ళి మనశాస్త్రిలుగారిని, వెంకటప్పావధానులుగారు న్నారే? వారిని, పనుందని ఉన్నపాదిగా పిలుచుకురా!

(తెఱలో) చిత్తము.

ఒరేయి చూడు! (తెఱలో అయ్యా)

తొందరగా పిలుచుకురావాలి.

(తెఱలో చిత్తం.)

మహా—ఆకాఫీ తాగండి, చల్లారిపోతుంది; కూతురు పెళ్ళిహడావిడిలో ప్రపంచమంతా మరుస్తున్నారు.

(గోవిందరావు కాఫీ త్రాగుచుండ తెఱపడును).



## రంగము 2.

(పెండ్లివారిల్లు తెఱయెత్తగా. ఒకప్రక్క నారాయణరావు కమలా పెండ్లి దుస్తులతో నిలచియుందురు. ఒకవైపు మహాలక్ష్మి, గోవిందరావు. బంధువులు నిలచియుందురు. మహాలక్ష్మి కాళ్ళుగడిగి పాటపాడి.)

మహా—పేర్లు జెప్పండి!

నారా—యిందాక చెప్పాం కాదండీ!

గోవిం—మళ్ళీ చెప్పరాదు?

వృద్ధు—రోజూ, యిహ యేలాగూ పిల్చుకుంటూనే వుంటారు. ముచ్చటల్లా యీ నాల్గురోజులే! శాస్త్ర అనండి నాయనా! వింటాము.

నారా—ఆలాగే కానియ్యండి. "కమలా! నేను వచ్చాం."

వృద్ధు—నాయనా! నాకు చెవుడు. కాస్తగట్టిగా చెప్పు బాబూ!

నారా—(నవ్వి) తాతగారు! మీ యిష్టమే కానియ్యండి "కమలా! నేను వచ్చామండి" వినవడిందా!

వృద్ధు—ఆహా! (కమలతో) అమ్మా మఱేనీవో!

కమల—(మిన్నకుండును).

నారా—మఱి నాచేత చెప్పించారు. మీ అమ్మాయిచేత చెప్పించండి.

వృద్ధు—ఏది చెప్పమ్మా.

కమల—(గట్టిగా) "నారాయణరావుగారు, నేను వచ్చాం"

వృద్ధు—శెభాష్! ఆలా వుండాలి.

నారా—సరే, గెలుపు మీదేలెండి.

వృద్ధు—కాక!

(తెఱలో బాబూ తలుపులదగ్గరే యింత ఆలస్యం జేస్తూంటే, యివ్వాళ సదస్యం తెల్లారేట్టుంది. ఎక్కడెక్కడనుంచో వచ్చి బ్రాహ్మణ్యం కనిపెట్టు కూర్చున్నారు. త్వరపడాలి. అమ్మా లక్షుమ్మగారూ! మిమ్మల్నేనండి! వధూవరులను త్వరగా తెమల్చండి.

గోవిం—పదండి, శాస్త్రుల్లుగారు తొందర పడుతున్నారు.

నారా—తప్పకుండా! యీ ఐదురోజులు సామ్రాజ్యం శాస్త్రులు వారిదే. అందులో యీన సీనియర్ మున్సలోని లాంటివాడు.

(అని అందరు పోవుచుండ తెఱపడును).

రంగము 3.

(వీధి. ప్రవేశము. ఆంజనేయులు, సుబ్బారావు,)

సుబ్బా—అయితే, పాపం అతని కేం తెలుసు?

ఆంజ—తెలియకేం? డబ్బుందిగా అన్నిమచ్చలు కప్పటానికి.

సుబ్బా—ఎంతడబ్బున్నా, అంత చెడ్డపేరున్న పిల్లను ఎవరు చేసుకొంటారు? మనలో మనమాట? కమల కీ నారాయణరావుకి మొదట నుంచి సంబంధమని వాడుక. ఈశంకరిరావు మధ్యలో వచ్చాడుట.

(ప్రవేశము వెంకటాద్రియ్య).

సుబ్బా—ఓహో వచ్చావు. నీకోసరమే ఎదురు చూస్తున్నాము.

వెంక—ఏం కథ?

ఆంజ—అబ్బే! ఏంలేదు, పెండ్లివారిని గురించి.

సుబ్బా—పెండ్లయి నాలుగునెలలు కావస్తోంది. యింకేం పెళ్ళివారు? అందులో "అష్టాదశవర్షేత్ భవేత్ కన్య" వివాహం కూడా నైరి.

వెంక—అందులోనే వుంది మజా! మరి సెకండుహాండు సరుకు కూడ నైరి.

ఆంజ—భేష్! బలే బాగాఅన్నావు - అనుభవంమీద - యీవిషయంలోకూడ నీఅడుగులే తొక్కుతున్నారు, మనుష్యులు'

వెంక—మనసంగతి వేరోయి. దానికి చిన్నప్పుడే ఆధీనం తప్పడంవల్ల...

సుబ్బా—మొదటినుంచి నీవే కంట్రాక్టు తీసుకొన్నా ననుకొంటున్నావు.

వెంక—అబ్బాయి! మీకు తెలియదు. అదినిజంగా పతివ్రత. నన్ను దప్ప మఱియొకరి నెఱుగదు.

ఆంజ—శంకరాచార్యుల శిష్యుడవుకూడ అయిరి. నీవు మరోలా అయితే డొక్క బద్దలుతీయవు.

వెంక—దానికేంగాని; ఆ నారాయణరావు ఆ ఎంగిలి బీడిముక్కను దగ్గరెట్టుకొని, "అనాఘ్రాతం పుష్పమ్" అని మురిసిపోతు న్నాడు పాపం; వాడికి తగిన శాస్తి అయిందిలే. ఏదో రెండు అక్షరంముక్కలు, పేరు వెనకాల తగిలించుకోగానే, తల తిరిగి పోతుంది.

సుబ్బా—నిజమే! మొన్న మొన్నటిదాక వీడిస్థితి అందఱు యెఱిగిందే, యిప్పు డెంతకొమ్ము లొచ్చినా.

వెంక—యిప్పుడుమట్టు కేమి యెక్కువ? నాకు అసలు సంగతంతా తెలుసు, వాడేం కొత్తగా యింతడబ్బు సంపాదించా డనుకొం టున్నావా?

ఆంజ—మఱి?

వెంక—అబ్బే! అసలుసంగ తేమిటంటే, నారాయణరావు వాళ్ళింట్లో పనిచేసేవాడుకదూ. అప్పుడే యిద్దరికి అలవాటైంది. యీడొ చ్చిన పిల్లయిరి. మొగాడు దగ్గరున్నాడయిరి. యింక అడగాలి సిం దేముంది? కొద్దిరోజులికి ఆసంగతంతా బయటపడింది. నలుగురు నోళ్ళలో, బడ్డ తరువాత, యిహ వాళ్ళిద్దర్ని దగ్గరుం చితే లాభం లేదనుకొని దొరగార్ని వెళ్ళగొట్టారు.

సుబ్బా—అలాగా! అసలు కిటుకు యింతవరకు మాకు తెలియదు.

వెంక—అప్పుడే యేమయింది? దరిమి లాన్ని, మాశంకరరావుగార్ని చేర్చారు. ఏ దోకట్టి పెడదామని. మనవాడు చూసాడు యేదో మెఱ్ఱగా పుల్లగా వుందిగదా అని. కొద్ది రోజులు కులాసాగా కాలం గడిపాడు. వాళ్ళందరు ఎలాగైనా మెడవంచి, పిల్లని అంట కట్టాలని చూసారు. మనవాడు కాలంగడపటానికి ఒప్పుకున్నాడు

గాని పెళ్ళి కొవ్వుకొంటాడా? యిహ వారిగడప తొక్కటం మానేశాడు, తనని బలవంత పెడతారని. యిహ ఊరుకుంటె యేం కొంపమునిగిపోతుందో అని గోవిందరావే యెక్కడో అడుక్కు దింటూన్న యీ త్రాష్టుడికి, యింతడబ్బుపంపి మసి బూసి మారేడుకాయ జేశాడు.

ఆంజ—అబ్బా! చాలాసంగతులు కనిపెట్టావే?

వెంక—అబ్బాయి! మనకితెలియకుండా యేంజరుగదనుకో!

సుబ్బా—రండోయి! కాసిని కాఫీనీళ్లు త్రాగివద్దామ్.

వెంక—అంతకంటేనా! పదండోయి (అని వెళ్ళెదరు. పిదప నారాయణ రావు మాట్లాడకయే నడచి పోవుచుండ తెలవడును).



# పశ్చాత్తాపము.

## అంకము 5.

### రంగము 1.

(నారాయణరావు యిల్లు. ప్రవేశం కమల.)

కమ—(తనలో) వివాహమై యిప్పటికి దాదాపు ఆరు నెలలు కావచ్చుచున్నది. మొదటిమూడునాలుగు నెలలు చాలా సంతోషంగా గడిపాము. సుమారు, రెండు నెలలు నుండి, వారు మిక్కిలి ఖిన్నులై, పూర్వపు కళను గోల్పోయి, నిద్రాహారముల మఱచి, అదేదియో విధముగానున్నారు. కారణమేమో తెలియుటలేదు. బహుశః లోకు లనేక విధముల ననుకొను వార్తలీయన చెవుల పడెనను కొందును. అవును. తప్పకుండా యింతే. ఆహా! లోకమెంత పాడుది. మనము యేమియెఱుగక పోయినను, మనదోషమేమియు లేకున్నను, యిచ్చవచ్చినట్లెల్ల మాట్లాడి, రచ్చకీడ్చుట ఒక నిత్య వినోదము వలెనున్నదే? ఓలోకమా! నోరులేని ఎందరమాయకుల కాపురమిట్లు కూల్చుచున్నావో? గదా! ఛీ! మానవసంఘమున జీవించుట యెంతకష్టము. నావలన, పాపం ఆయన ఎంత చింతించుచున్నారో? ఎంతబిగబట్టుకొన్నారో? యిలా తిరుగుతున్నారు. పాపం. నన్ను ప్రేమించి, యిన్నిదినములకు పెండ్లియాడి, సమస్త సౌఖ్యముల ననుభవించెదమను నాశతో, నున్న వారి యాశ నిరాశ యయ్యెను. పై పెచ్చు నలుగురి నోళ్ళలోను పడవలసి వచ్చెను. యీ పాపిష్టి నోళ్ళు యింకాయెన్ని కూతలు కూయునో? యింతకూ యిదంతా నావల్లవచ్చింది. నన్ను పెండ్లి చేసుకొనకున్నచో, ఆయన హాయిగా నిశ్చింతగా వుండెడివారు. యిప్పుడా, తీరని మనోవేదనచే చిక్కుచున్నారు. యిహకొన్నా

ళ్ళిలా వున్న వారి యారోగ్యవిషయమై, నాకుభయమగుచున్నది. నేనిచ్చట, లేకయున్న, యీ నోళ్ళుకాస్త మూతలడును. పాపం! వారికొరకై నా యీత్యాగంనేను చేయాలి, చేసి తీరుతాను. నేననే వ్యక్తి జీవముతో కంట కనబడుచూ ఉన్నన్నాళ్ళు ఆయన కీయపవాదం తప్పదు. నేనిచ్చటనుండి తొలగుటయే కర్తవ్యము. వారిమీద ప్రేమచేతనే, యిట్లు చేయుట వారిసౌఖ్యము కొఱకే, యీ నా త్యాగము. ఇంక నేను త్వరపడవలయును. ఆయన కెంతటి త్వరలో మనశ్శాంతియొనగూర్చిన అంతటిధన్యను. యింకనాల సింపరాదు (వినుట నభినయించి) ఏమి! ఎవరో పిలుచుచున్నారు! (అని వెళ్ళబోవుచుండ తెలుపడును.)

## రంగము 2.

(రాత్రి నారాయణరావుయిల్లు దీపం తగ్గించియుండును. నారాయణరావు ఒక్కడు మంచముపైపరుండి నిదురపోవుచుండును. నారాయణరావు లేచిబయటకు వెళ్లివచ్చి)

నారా—యిదేమి? తలుపులిట్లు వోరవాకిలిగా వేసియున్నవి? దొంగ లేమైనా వచ్చారా యేమిటి? చప్పుడేమియు వినబడుటలేదే? కమలా! కమలా! యేమినిద్రా! (అని మంచము డాసిచూచి) ఏదీ? ఎక్కడకు వెళ్ళినది? యెప్పుడునూ అలా వెళ్ళదే? కమలా! ఐన జూచెదను. (అని దీపము పెద్దదిజేయగా దానిక్రింద నొక ఉత్తరముండును. అదితీసి) యిదేమి? యిచ్చటి కెట్లువచ్చెను? (అని ఉత్తరమునిచ్చి) ఎవరూ! "నాప్రియమైన నాథా! నేనిట్లు ఆశ్చర్యకరముగా యెట్లు మాయమైతినని మీరు విచారింప వచ్చును. నేను నాయొక్క స్వయంబుద్ధివలననే, నిశ్చలచిత్తముతో, మనోవాక్కాయకర్మల సాక్షిగా, యీకార్య మొనరించు చున్నాను. నేనిచటనుండిన మీకిక మనశ్శాంతి యుండదు. వివాహమైన యేడాదీ యీమధ్య మీయొక్క పరివర్తన, మనో వైకల్యము, వ్యధ నేనెఱుగకపోలేదు. మీమెత్తనిమనసు లోకు

లనేకవిధములుగా ననుకొను మాటలకు మిగుల నొచ్చియుం డును. నేను కంటికి కనబడుచున్నన్ని నాళ్ళు, వాళ్ళనోళ్ళు పల్కు చునే యుండును. మీకిక శాంతియుండదు. కావున నేనిచ్చట నుండి తొలగిన''...(అని మిగిలిన ఉత్తరము చదువక యే) హా! తెలిసినది. ఎంత స్వార్థత్యాగము! పాపము, తానేమెఱుగును? తనకెందు కింతటి కఠినశిక్ష? చిన్నతనము! యుక్తాయుక్తాలు తెలి యని ఉద్రేకంలో యిలాచేశింది. యిదంతయు నాపొరపాటు. యేవో నీలివార్తలు చెవులపడిన, వాటిని సరకుగొనక నిశ్చలముగా నుండుటకు మారు, నాయొక్క మనోవైకల్యమును బయట పెట్టుట వలననేకదా! కమల యిట్లు చేయుట! యింతకు అయిన దేదో అయినది. కమల యేమైయుండును? రెండురోజులు తాళి చూచిన...అబ్బా! వీలులేదు! వీలులేదు!! యిప్పటికే అందరన్ని విధముల ననుకొనుచున్నారు. నే నింటనుండి కమల లేకపోయిన, లోకము మరింత యనుమానించి, ఆమెను నింద పాలుచేయును. నే నిచ్చటనుండి వెంటనే తొలగవలయును. లోకులు మేమిరువు రము లేక, యిల్లు తాళము వేసియుండుటచూచి, మేము అత్యా వసర పనిమీద, యెచ్చటికైనను వెళ్ళి యుండవచ్చునని సమా ధాన పడెదరు. మెల్లగా కమలను వెదకి తీసికొనివచ్చెదను. అదిగో! తెల్లవాఱు వచ్చుచున్నది. దాసి వచ్చువేళయినది. కమల పలాయనవృత్తాంత మేమాత్రము తెలసినను, ఆమెకు నిందతప్పదు. యింక త్వరగా ప్రయాణము చేయవలయును. (అని నర్దుట నభినయించి యిటునటుతిరుగుచుండ తెరపడును.)

## రం గ ము 3.

(శంకరరావుగారి యిల్లు—టీపార్టి.
శంకరరావు, రంగారావు, సత్యం, రాజు కూర్చొని యుందురు)

రంగా—Congratulations on your appointment. (నీయొక్క అదృష్టాన్ని అభినందిస్తున్నా) మనవాళ్ళల్లో, యింత పెద్ద ఉద్యోగం రావడం, నిజంగా చాలాఅదృష్టం.

శంక—థ్యాంక్సు వెరీమచ్. కొద్దిరోజులు; ఆక్టింగేగా!

రాజు—అయితే నువ్వు డిస్ట్రిక్టు జడ్జీగా చార్జియెప్పుడు హాండోవర్ జేసుకోవడం?

శంక—I am doing it on the 4th. (రేపు నాల్గోతారీఖున పని వేశిస్తా.)

సత్యం—అబ్బె! ఆనాడు అమావాస్య, మరోరోజు...

శంక—Damn it! Why do you still believe in such trash? (ఛా! ఛా! యింకా అలాంటి పిచ్చినమ్మకాలు పోలే?) చూడు, నాపేరంటే అమావాస్య గిమావాస్య గడగడ లాడాలి. మన్నేంచేస్తుందోయి!

రంగా—ఎక్కడో తద్దిన బ్రాహ్మణుడులాగ దొరికావుబాబూ! కాస్త బ్రాహ్మణార్థాలైనా రివైవు చేయగూడదూ! నిరుద్యోగసమస్యా పరిష్కారంగూడ అవుతుంది.

సత్యం—నాకభ్యంతరమేంలేదు. వడుగని జందెపుపోగు మెళ్ళో మెప్పుడైతేవేసి,కార్యక్రమం "భవతీభిక్షాందేహీ" తో మొదలెట్టారో, అప్పుడే యిచ్చారు, మనబ్రహ్మిగాళ్ళకి అడుక్కుతింటానికి యావజ్జీవపు లైసెన్సు.

రాజు—దానికేంగాని, అయితే శంకరం! నువ్వు మాకంపెనీలో యిన్సూరెప్పుడు చేస్తావ్?

శంక—నాకుయిన్సూరెన్సు ఎందుకోయి! It's a shere waste. (వృత్తదండుగ)

రాజు—అదికాదు, నువ్వొకవేళ హఠాత్తుగా చస్తావనుకో!

శంక—సో సారి. నేనెందుకను కొంటాను చావాలని? మీరింత మంది బాగుండగ.

రంగా—ఓ యస్. చావంటే జ్ఞాపకం వచ్చింది. లేటెస్టు న్యూసు తెలుసుగా! మొన్ననే కాలవలోకి ఓ స్త్రీశవం కొట్టుకొచ్చిందని. దానిరూపురేఖాదులు చాపలుతినేసినా ఆకారంబట్టి అదెవరో గోవిందరావు గారట, వారికూతురు కమలదని తేల్చారు.

సత్యం—ఆమె అచ్చటి కెట్లువచ్చెను?

రంగా—దేవుడికి తెలియాలి.

శంక—కానీ బ్రదర్, తరువాతకధ.

రంగా—డాక్టర్లు ఆశవాన్ని పరీక్షచేసి బలవన్మరణము పొందెనని చెప్పారు. ఆమెభర్త నారాయణరావట-ధనవంతుడు గూడానట. పరారియైనట్లు తెలియవచ్చుచున్నది.

రాజు—తర్వాత

రంగా—యింక తర్వాత యేమున్నది? భార్యను చంపెనను. నేరముపై నారాయణరావును పట్టుకొనుటకు పోలీసువారు భోగట్టా చేయుచున్నారు.

శంక—(తనలో) The fellow looks that. (వాణ్ణిచూస్తే తెలియటంలేదూ?) నేనప్పుడే అనుకున్నా. వాడికి, ఆ professional Criminals కి (సామాన్య నేరస్తులకి) వుండాల్సిన ఫేసు వుంది.

సత్యం—బాగా డబ్బుకూడా సంపాదిచ్చాట్ట యీమధ్య వాడు.

రాజు—నేననుకోవడం భార్యను యిన్సూరుచేసి మర్డరుచేసి వుంటాడని. డబుల్ లైఫు అయితే వీణ్ణది చంపేది.

శంక— I say! Can't you forget your nasty Insurance now? (ఎక్కడి కెళ్ళినా నీ యిన్సూరెన్సు తద్దినమేనా ?)

రంగా—That is the pity with these Insurance Agents. (యీ యేజంటుగాళ్ళంతా యింతే) ఎక్కడైనా కాస్త సందు దొరికితే ఓ యిన్సూరెన్సు లెక్చెరు కొట్టారన్నమాటే !

సత్యం—వీళ్ళసంగతే చెప్పావూ ! నోరుదెరిస్తే చావు - చస్తే యేమౌతుందీ ?

రంగా—బహుశః వాడు దొరక డనుకొంటా !

సత్యం—అబ్బాయీ ! దొంగతనం, రంకుతనం దాగదు. వాడు నిజంగా నేరంచేసివుంటే తప్పకుండా దొరుకుతాడు. లేకపోతే తుపాకీ గుండు కందదు.

రంగా—బ్రదర్ ! మరిచిపోయాను. యీరోజున రోషనారా వచ్చింది. యేదైనా పార్టి అరేంజి చేస్తే...

శంక—Is she good looking Boy? (యేమన్నా బాగుంటుందా?)

రంగా—యింకా అడుగుతున్నావా ! ఫస్టుగా వుంటుంది. బలే చమక్. యివ్వాళ సాయంకాల మెళ్ళా లనుకొంటున్నా.

శంక—Then why can't we go together in my car? (నా కార్లో ఎందుకు కలిసి వెళ్ళకూడదు ?)

రంగా—O. K. (సరే) అలాగే పోదాం. యేం రాజు ? వస్తావా నీవు కూడ ?

రాజు—అంతకంటేనా ! తప్పకుండా వస్తా. మరి సత్యం...

సత్యం—ఖర్చులేమి నేను పెట్టుకోనక్కర లేకపోతే...

రంగా—అలాగే లేవోయ్. యెప్పుడు పెట్టుకున్నావు నీ జన్మలో !

సత్యం—అయితే తప్పకుండా వస్తా. కాస్త కాఫీనీళ్ళు కూడా...

రంగా—ఆ; అలాగే. నీకీసంవత్సరానికి కావలసిన వన్నింటికీ ఒకటే మాటు లిస్టువ్రాసి పడేయ్. స్వయంపాకం అర్పించుకొంటాం.

శంక—(అద్దము చూచుకొని) క్రాపు బాగా పెరిగిపోయింది. బాయ్(Boy)!

(తెఱలో సార్)

బార్బరుని అర్జంటుగా తీసికొనిరా క్రాపుచెయ్యాలని. చూడూ! కార్లోతీసుకరా ఆలస్యమౌతుందేమో.

రంగా—అయితే మేంకూడ వెళ్ళివస్తాం. శంకరం! ఒకమాట. చూడూ! యివ్వాళ బ్యాంకిలోనుంచి డబ్బు తీసుకోవడం మరిచిపోయాను. హండ్రెడు రూపీ నోటు మార్చలేదు. కొంచెం చిల్లర యేమైనా జేబులో వేసుకరా.

శంక—O! yes, అలాగేలే!

రంగా—గుడ్ యీవ్‌నింగ్. (అని షేకుహాండ్సు యిచ్చిన తరువాత రంగారావు, సత్యం, రాజు నిష్క్రమించెదరు. రంగారావు పోవుచు డబ్బుసంగతి మరచిపోవద్దని సౌజ్ఞచేసి పోవును.)

శంక—(తనలో) Now this is my Chance. (నాకు బలే ఛాన్సు చిక్కింది.) నా ఫష్టుకేసు యిదే. చూపిస్తా నా తడాఖా. డొక్క బద్దలు చేయిస్తా. నాకు జరిగిన Insult (పరాభవము) ! This fellow shall pay very dearly. (వీడు బాగా అనుభవిస్తాడు.) నాకు టైము అవుతూంది. మళ్ళా వాళ్ళు వచ్చే వేళ యింది. తొందరగా డ్రెస్ చేసుకోవాలి (అని పోబోవుచుండ తెఱపడును.)

## రంగము 4.

(ప్రవేశము నారాయణరావు.)

నారా—(స్వగతము) కమలజాడ యింతవరకూ తెలియలేదు. ఆమె యేమయ్యెనో తోచకున్నది. ఆత్మహత్య నొనరించెనను నమ్మ

కము చాలకున్నది. ఒకవేళ నిజముగా నాకమలయే మరణించిన నాజన్మ నిరర్థకము. నేను జీవించుట అనవసరము. (అనుకొను చుండ వెంకటాద్రియయ్య పోలీసులతో ప్రవేశము).

వెంక—మెల్లగా రండి. పారిపోతాడు. వాడు అసాధ్యుడు. చూడండి! మీరు ముందరుండండి. వాడిదగ్గర పిస్తోలేమైనా ఉంటుంది.

1వ పో—యింకెక్కడికి పోతాడు (అని నారాయణరావును సమీపించి భుజముపై చేయివేయును).

2వ పో—(చేతులు పట్టుకొనును)

నారా—(పోలీసువారిని చూచి అదరిపడి) అయ్యా! మీ రెవ్వరు?

వెంక—కనబడ్డంలేదు? వారు పోలీసులు. తమకోరకొచ్చారు.

నారా—నువ్వెక్కడనుంచి వచ్చావయ్యా! (పోలీసులను చూచి) నాకోఅకా! ఎందుకు?

వెంక—అబ్బే యేంలేదు. తమకు గవర్నరుగారు టీపార్టి నిస్తారట. దానికి రమ్మని.

నారా—యేం పిచ్చిగా మాట్లాడుతున్నావ్?

వెంక—(2వ పోలీసు వెనకాలచేరి) గట్టిగాపట్టుకోండయ్యా! పారి పోతాడు. కోర్టువారు వాగ్దానముచేసిన రు 500 లు, యీఆర్నెల్ల కష్టం తుడిచిపెట్టుక పోతాయి

1వ పో—(నారాయణరావుతో) మీరు అరెస్టు చేయబడ్డారు.

నారా—అరెస్టు! యరస్టేల?

2వ పో—నీకు జవాబు చెప్పవలసినఅవుసరంమాకులేదు. తొందరగారా!

నారా—అయ్యా! మీరుపొరబడియుంటారు. నేనెవ్వరినో మీకు...

వెంక—ముంజేతి కంకణానికి అద్దమెందుకు? మీకోసమేవచ్చారు.

నారా—(ఉద్రేకముగా) నేనేమియు నెఱుగను. నాకేమియు తెలియదు.

1 పో—అయ్యా! నువ్వేం మాట్లాడినా నీమీద అదంతా trial లో evidence గా వుపయోగిస్తాం. జాగ్రత్త! అల్లరిచేయకుండా రా! చదువుకొన్న వాడివి కూడాను.

నారా—నన్నెందుకు అరెస్టుచేయుచున్నారో? అడుగవచ్చునా?

వెంక—ఆహా! అంతకంటేనా? నీభార్యను హత్యచేసితివను నేరము. తెలసినదా?

నారా—నాభార్య!... హత్య!... అమ్లైన కమల?

వెంక—వచ్చింది! తమ పశ్చాత్తాపము వెల్లడయింది.

నారా—కమలా! కమలా! (అనివడిపోవుచుండ తెలపడును.)



# పశ్చాత్తాపము.

## అంకము. 6

### రంగము 1.

(ఊరిబయటతోట ప్రవేశము కాషాయవస్త్రము ధరించి ప్రసాదరావు)

ప్రసా—అహా! వైరాగ్యమునందు ఎంతసుఖమున్నది. మానవులు మదించి, "సంసారం సాగరం దుఃఖం" అనునార్యోక్తిని మఱచి, విషయలంపటులై, భోగలాలసులై, జీవితము నిత్యమనియు, కోర్కెల దీర్చుకొనుటయే ప్రధాన కర్తవ్యమనియు తలచి, అనేకవిధముల విచ్చలవిడిగా తిరిగి, పిదప శారీర, మానసిక, ఆర్థిక కష్టములనెన్నో అనుభవించుచున్నారు. నాగతిచూచిన తెలియుటలేదా? పాపిని. దుర్మార్గుడను. కట్టుకొనిన భార్యను, కన్నకుమారుని, నిర్హేతుకముగా విడచితిని. వారి యునికినెఱిగియు, సాయపడకుంటిని. పిదప తల్లిమరణానంతరమున నన్ను చేరవచ్చిన బాలుని, కన్నకుమారుని తూలనాడి, నొప్పించి వెడలగొట్టితిని యింతకూ వెంకట్రామయ్యను యేమనిన యేమిఫలము? నావిధి విధినేల? నన్ననుకొనవలయును. యింక శంకరునకు అల్లారుముద్దుగా విద్యాబుద్ధులు చెప్పించి, పెంచి పెద్దవానినిచేసి ధనము విచ్చలవిడిగా ఖర్చుపెట్టి వాడు నాకేమియో చేయునని భ్రమించితిని. చేసెను. కావలసిన శాస్తిచేసెను. నావంటి పాపి కిదియొక శిక్షయా. భగవంతుడా! నాదోషము క్షమింపరానిది. నాపాపము వినరానిది. నేనీచుడను. నన్నంటిన దోషము. చూచిన పాపము. తలచిన బ్రహ్మహత్యాపాతకము. ఆహా! అంత జమీందారుగా నుండియు ఎంతమనఃక్లేశము. అంతడబ్బుండియు ఎంత ఆతురత. కావలసినవన్ని యుండియు ఎంతటి అత్యాశ! ఆదినములు వేఱు. నేనిప్పుడొక సన్యాసిని. ఆహా! యీజీవితమెంత సౌఖ్యప్రదము!

ఎంత శాంతియుతము! ఎంత విచారరహితము. ఎంత ఆనందమయము. శ్రీహరీ! నన్నిట్లే యుండనిమ్ము. (అనుచుండగా రక్షింపుడు. రక్షింపుడని కమల పరుగెత్తుకొని వచ్చుచుండును. సుబ్బారావు వెంబడించుచుండును. కమల ప్రసాదరావు కాళ్ళపై బడును. ప్రసాదరావును చూచి, గుర్తించి అదరిపడి సుబ్బారావు తలవంచి వచ్చినదారిని మఱలును)

(కమలతో) అమ్మా! లెమ్ము నీకు భయములేదు.

కమ—తండ్రీ! ఆ దుర్మార్గుడు, అదిగో, వచ్చుచున్నాడు రక్షింపుము.

ప్రసా—భయములేదు. అమ్మా! చూడు! వాడులేడు.

కమ—(భయముతో మెల్లగాలేచి, చూచి ధైర్యము తెచ్చుకొని) తండ్రీ! నన్ను రక్షించితివి. లేకపోయిన...

ప్రసా—(తేరిచూచి) అమ్మా! నిన్ను నేనెక్కడో చూచినట్లున్నది, నువ్వు గోవిందరావుగారి...

కమ—అవును తండ్రీ. అయిన ఆ కమల చనిపోయినది. యీ కమల యింకొకతె.

ప్రసా—అమ్మా అట్లనుకొనకుము. నీకువచ్చిన భయమేమియులేదు. సంగతు లన్నియు సావకాశముగా పిదప మాట్లాడుకొనవచ్చును. నీకు కొంచెము విశ్రాంతి అవుసరము. రమ్ము, మన కుటీరమునకు పోవుదము. (అని తీసికొనిపోవుచుండ తెఱపడును).

---

## రంగము 2.

(సెషన్సుకోర్టు. జడ్జి శంకరరావు. కొంతమంది ప్లీడర్లు. పబ్లికు ప్రాసిక్యూటరు, పోలీసులు, యితరకేసుల సాక్షులు, ప్రేక్షకులు, వెంకటాద్రియయ్య, జూరి, మొదలగువారు కూర్చొని యుందురు.) బెంచిగుమస్తా లేచి బోనులోనున్న సాక్షినిచూచి.

గుమ—దేవుని ఎదుట.

సాక్షి—దేవుని ఎదుట.

గుమ—ప్రమాణంచేసి.

సాక్షి—ప్రమాణంచేసి.

గుమ—అంతా నిజంచెప్తా.

సాక్షి—అంతా నిజంచెప్తా

గుమ—అబద్ధం చెప్పను.

సాక్షి—అబద్ధం చెప్పను.

గుమ—నీ పేరు.

సాక్షి—గురవయ్య.

గుమ—తండ్రి పేరు.

సాక్షి—అచ్చన్న.

(తెలులో, "అయ్యా అతడు నిర్దోషి. యిది అంతయు నన్యాయము." అందఱు ఉలికిపడి ఆవైపు చూచుచుందురు)

(కమల ప్రవేశించి)

కమ—అన్యాయముగా శిక్షించుచున్నారు. వదిలెయ్యండి. నేను...

వెంక—పిచ్చిది. పిచ్చిది. పట్టుకోండి.

కమ—నన్ను చంపలే...

శంక—Who allowed this mad-woman here? I say Police! Come-on Man, Check her out at once! (ఈ పిచ్చిదాన్ని ఎవరిలా రానిచ్చారు? అరే పోలీస్! చూస్తా రేమిటా?) (పోలీసు లామెను బలవంతముగా తీసికొని పోవుచుండ)

కమ—నాకు పిచ్చికాదు! నిజం; నేను చావలేదు. (లాగుకొనిపోబడును.)

వెంక—యిదే పిచ్చిధోరణి. యింతకన్నా పిచ్చిమాట లుంటాయా?

శంక—Silence this is a Court! (సైలెన్సు. కోర్టు అని తెలుసుకో) (గుమస్తావైపు తిరిగి) Let us adjourn this case; look to the next one! (ఈకేసు యీవేళకు వాయిదావేసి, తరువాత కేసుచూడు.)

గుమ—యస్, యువర్ ఆనర్! (పోలీసులవంక తిరిగి) Narayana Rao, accused, in Chatrapur, Murder-case. (ఛత్రపూర్ ఖూనీకేసు ముద్దాయ్ నారాయణరావును తీసుకరండి.)

పోలీ—(వెళ్ళి శృంఖలా బద్ధుడగు నారాయణరావును తీసుకవచ్చెదరు.)

శంక—(ఒక న్యాయవాదినిచూచి) You can proceed on with your arguments, from where you left them yesterdy; Mr. pantulu. (పంతులూ! నిన్న చెప్పగా మిగిలిన మీవాదన పూర్తిచేయండి).

పంతులు—యస్. యువర్ ఆనర్, నిందితుడు ఎలాహత్యకు కారకుడు కాడో నిన్ననే మనవిచేశాను. Motive of crime (అపరాధ కారణము) సరియైనంత కనబడడంలేదు. Time of crime (అపరాధ సమయము) కూడ tally (సరి) అవడంలేదు. యింతకీ dead body (శవము) యొక్క identity (పోలిక) సరిగా నిర్ణయింపబడలేదు. సాక్ష్యంకూడ అంత బలంగాలేదు. ఒక్క వెంకటాద్రియయ్య సాక్ష్యం తప్ప, తక్కినసాక్ష్యం యీనిందితునికి విరోధంగా యేమాత్రంలేదు. యింక వెంకటాద్రియయ్య సాక్ష్యంలో నిందితుడు, అతనిభార్య మంచి అన్యోన్యంగా లేనట్లు, అతని భార్యప్రవర్తన బాగుగాలేనట్లు, నిందితుడు మందలించిననూ ఆమె వినకపోవుటవలననో, మఱి యెందువలననో ఆమెను, హత్యగావించెనని చెప్పబడియున్నది. యిందేది యెంత

వరకునిజము ? నిందితుడు హత్య జరిగినరాత్రి క త్తిని చేతపట్టు కొని కాల్వవైపునుండి వచ్చుచూ, తన కగుపడెననియు, అతనిముఖము భయాకలితమై, పాలిపోయి యుండెననియు, మాట్లాడక యే త్వరగా వెళ్ళిపోయెననియు, వెంకటాద్రిమయ్య చెప్పెను. యింతకూ హత్య యెక్కడజరిగినట్లు? ఇంటా? బయటా? బయట చంపునంతటి మూర్ఖుడుకాడు నారాయణ రావు. ఇంట చంపిన క త్తిని యేల బయటకు గొనిపోవును? ఆ క త్తియేది? శవముపై క త్తిగాయములున్న వా? యిదిఅంతయు ఆలోచించిచూడ వెంకటాద్రిమయ్య సాక్ష్యము నమ్మదగినదిగా లేదు. వెంకటాద్రిమయ్య సాక్ష్యముతప్ప నిందితుని ఆ crime లో link (నేరముతో కలిపే) చేసే evidence (సాక్ష్యము) యేమాత్రం లేదు. తక్కిన సాక్ష్యమంతా కేవలం, concoction (కల్పితము). In the light of the above circumastances, it is my consider opinion, your honour, that my claint is not guilty (పై వన్నీ ఆలోచించిచూడ యీ ముద్దాయి పూర్తిగా నిరపరాధియని పొడగట్టుచున్నది). కనక తమరు అన్నీఆలోచించి నిరపరాధిని శిక్షచేయకుందురు గాక! యని నాప్రార్థన.

శంక—Have you finished now? (చెప్పవలసినదంతాఅయినదా?)

పంతు—యస్ యువర్ ఆనర్!

శంక—(పబ్లిక్ ప్రాసిక్యూటరువైపు తిరిగి) Carry on (కానియ్యండి).

పబ్-ప్రా—యువర్ ఆనర్! జంటిల్ మెన్ ఆఫ్ ది జ్యూరీ! You are now faced with a diabolical crime which is unique in the annals of criminal history (మీయెదుట నున్న అపరాధము వంటిది మీరెన్నడును కని, విని యెరుగరు). యీనిందితుడు is a criminal of the worst type (తెగించిన అపరాధి). యితని crime full గా

prove (నేరము పూర్తిగా ఋజువైనది) అయినది. నిందితుని తరఫున కోర్టువారు అప్పాయింటుచేసిన మైఖేలిండు పంతులు గారిని మనఃపూర్వకముగా అభినందిస్తున్నాను. Never was a loosing case better defended. (యింత నిరాధారమైన కేసును యింతబాగా ఎవరునూ వాదించలేదు). Now, coming to the case proper, (యిక యీ కేసు సంగతి కొద్దాం) motive of crime (నేరానికి కారణం) కనబడు తూనేవుంది భార్యపైవత్తన ననుమానించెను. ఆమె డబ్బు కాశపడి కూడ వుండవచ్చును. యితను తన మదర్ని Poison (విషము) చేశాడన్న రూమారున్నట్లు రిలయబుల్ evidence (సాక్ష్యము) వల్ల తెలియవస్తూన్నది. This man seems to be a criminal with a record behind him. (వీడు తెగించిన పాతనేరగాడులా వున్నాడు) అసలు ఒకమాటు Justice escape (శిక్ష తప్పించుకొన్నా డంటే) అయ్యా డంటె యింక motive of crime (నేరానికి కారణం) అనేవి కావలసినన్ని Notriety, (పెద్దపేరు రావాలని) పెద్దహంతకు డవ్వాలని ఆశ. డిటెక్టివునావల్సులోని ఘట్టాలను practical (ప్రత్యక్షంగా) గా నడపాలని yearning(ఆశ) వీడు Black-Magic (యింద్రజాలము) కూడ ప్రాక్టీసుచేశాట్ట. దానికోసం యేమయినా అవుసరంవచ్చి చంపాడేమొ! College career లో వీడు notorious roudy! (చదువుకొనే రోజుల్లో వీడు వుత్తరౌడీ). అని భోగట్టామీాద తెలియవచ్చింది. Motive? (కారణాలు?) motive (కారణం)కు యేమిటి! లక్షవుంటాయ్. కమల కనబడటంలేదు; పిదప నారాయణరావు పరారి; కమల శవం తేలింది. గురుపట్ట బడింది; నారాయణరావును క త్తితో వెంకటాద్రియ్యగారు చూశారు వారి మోతుపరిసాక్ష్యం యెందుకు నమ్మడానికి వీలులేదో తెలియడంలేదు? యరస్టు

సందర్భమున పెద్ద struggle (పోట్లాట) put up (గావించి) చేసి పోలీసులను గాయపఱచి, అతికష్టమ్మీద పట్టుపడ్డాడు. నిందితుడు చాలా sullen (అలక్ష్యంగా) గా అడిగిన ప్రశ్న లకు జవాబు లివ్వటంలేదు * యిక Circumstances all point out the accused, as the man responsible for the crime. Motive is known to you all. కనుక Gentlemen of the Jury ! I request you to weigh the evidence well. The man before you is a maniac and a menace to peace and civilization. యితన్ని వదిలిపెట్టే యెడల It will be a primium on crime and a discount on straight life and honesty. కనుక తమరు యీహంతకుని మీద యేమాత్రం sympathy చూపించకుండా you will do your duty to the public, and save them from the clutches of a relentless and a determind maniac. I request you to award the accused the extreme penalty of law, considering his nefarious deeds in the light of the evidence presented. Requesting you all Gentlemen once more to see that justice, and full justice is done, I now take your leave.

---

* యిక విషయాలన్నీ ఆలోచించగా యీ నిందితుడు యీ నేరము తప్పకుండా చేసి వుంటాడని స్థిరపడుతూంది కనుక తమరు సాక్ష్యాన్ని బాగా ఆలోచించ వలయునని నాప్రార్థన. మీయెదుట నున్న వీడు, ఘోరపాపి! కర్కశహృదయుడు, గుండెలు తీసిన బంటు. వీణ్ణి వదిలిపెట్టే యెడల మానవ సంఘమునకు, ప్రజాశాంతికి తీరనిహాని కల్గును. అప్పుడు నేరము చేయువారిని మెచ్చుకొనుటయు, న్యాయజీవనమును శిక్షించుటయు చేసినట్లవక తప్పదు. గనుక తమరీ హంతకుని

శంక — Gentlemen of the Jury, You have now heard the evidence and the arguments put forth by the defence and the prosecution. I request you to retire, deleberate over this matter and give me your decission. I request you not to be carried away by feelings of sympathy, and do your duty to the public, serving the cause of the justice. Gentlemen! you can now retire. (జ్యూరివారు లోనికివెళ్ళి కాసేపున్న పిదప వచ్చెదరు).

శంక — (Foreman ను చూచి) Have you arrived at any decision?

---

యేమాత్రము దయతల్చక మీనిర్యుక్త కర్తవ్యము నిర్వర్తించి ప్రజల నీ కిరాతుని బారినుండి రక్షింపవలయును. యితని ఘోరాపరాధమును విచారించి, మోతుబరి సాక్ష్యమును లక్ష్యముంచుకొని, చట్టసమ్మత మెంతవరకు గలదో అంత కఠినశిక్షలు నిర్దాక్షిణ్యముగా వేసి వీని నీ సంఘమునుండి తొలగించి మానవజాతిని, ప్రజాశాంతిని, లోక కల్యాణమును కాపాడుదురు గాక! యని నమ్ముచున్నాను. (అని కూర్చుండును.)

శంక — జంటిల్‌మన్ ఆఫ్ ది జ్యూరి! మీరు ముద్దాయితరఫు వాదము, ప్రాసిక్యూషన్ వారు తెచ్చిన సాక్ష్యమును, చేసిన వాదనయు విని యున్నారు. మీరింక దయచేసి లోనికివెళ్ళి యీ అపరాధమును గురించి బాగా ఆలోచించుకొని యీ విషయమై మీ యొక్క అభిప్రాయము నకియవలయునని ప్రార్థించుచున్నాను. యిందు మీరే విధమైన జాలితల్చక లోకమునకు మీయొక్క బాధ్యతను చక్కగా నిర్వర్తించెదరని నమ్ముచున్నాను.

(జ్యూరివారు లోనికివెళ్ళి కాసేపుండి మరలవచ్చెదరు).

ఫోర్మన్—Yes, your honour! The jury by a majority is of opinion that the prisoner is not guilty.

శంకర—What! beg your pardon! you meant guilty?

ఫోర్మన్—No, your Honour. The prisoner is not guilty.

శంకర—Arguments on both sides have been heard. The prosecution have established a definite motive for crime and all the evidence points out to the accused as the man responsible for the crime. I see no reason to disbelieve any evidence as such, and in full disagreement with the learned members of my Jury I hold the prisoner fully guilty under Sec. 30 2 A.,I.P.C. for the crime with which he is now accused. It is very seldom that we meet with people of this sort who have a passion for murder. If

---

శంకర—(జ్యూరి పెద్దనుచూచి) యేమి? యేదైనా అభిప్రాయాని కొచ్చారా?

జ్యూరీపెద్ద—యస్ యువర్ ఆనర్! జ్యూరీలో మెజారిటీ అభిప్రాయం ప్రకారం నిందితుడు నిర్దోషి.

శంకర—ఆ.........యేమన్నారు? దోషి యనియా?

జ్యూరిపెద్ద—కాదు. నిందితుడు పూర్తిగా నిర్దోషి.

శంకర—సరే. రెండువైపుల వాదన వినడమైనది. ప్రాసిక్యూషన్ వారు నేరము జరగడానికి బలమైన కారణములు చూపించినారు. సాక్ష్యమంతయు నిందితుని నేరస్థునిగా నిర్ధారణ చేయుచున్నది. యింతటి మోతుబరిసాక్ష్యము యెందుకు నిరాకరించాలో నాకు తెలియడంలేదు! పూజ్యులైన మా యీజ్యూరీవారి అభిప్రాయ

cases of this sort go unpunished, or lightly treated, crime will form a regular part of our life. In the interests of the Justice and fair play, and much more, in the interests of public peace and tranquility, I award the prisoner the highest penalty of law. I condemn the prisoner, to be hung by the neck until he is dead. (అని శంకరరావు లేవబోవుచుండ తెలివపడును).



రంగము 3.

(జైలు, జైలుసూపరింటెండెంటుతో ప్రవేశము, నారాయణరావు.)

నారా—అంతయూ నైనది. నాకమల చనిపోయినది. యింక నేనెందుకు బ్రతుకుట! ఆమె యెప్పుడంతరించెనో నాజీవము నాడే పోవలసినది. ఆమెలేని బ్రతుకేల? ఆమె లేనందువల్ల యీతుచ్ఛ జీవితమును అంత్య మొనరింతమన్న ఆత్మహత్య మహాపాతకమట!

---

ముతో సంపూర్తిగా భేదించి యీనేరస్థుడు, తనపై నారోపింపబడిన నేరమునకు ఉత్తరవాదియని నిశ్చయించుచున్నాను. యితడు యిండియన్ పినల్‌కోడ్డు శెక్షన్ 302 ఏ. ప్రకారం శిక్షార్హుడు. ఇలాంటి నేరాభిలాషులైన అపరాధులు, హంతకులు మనకు సామాన్యంగా కనబడరు. యిట్టి అపరాధములను చులకనగా చూచినను, తగుశిక్ష వేయకపోయిననూ, అపరాధము లెక్కువై ప్రజాశాంతికి భంగముకల్గును. నేను యీ అపరధాకి ప్రజాక్షేమము కొరకై, న్యాయ పరిపాలనార్థమై, నిష్పక్షపాతముగా, చట్టమునగల అత్యధికశిక్షను విధించుచున్నాను. యితడు చచ్చు పర్యంతము ఉరితీయబడుగాక! అని యాజ్ఞాపించుచున్నాను. (అని లేవబోవుచుండ తెలివపడును)

శభాస్! యిప్పటికా భయంతీరింది. నిశ్చింతగా చచ్చేదను. అహా! ప్రపంచమున యెంతటి దుర్మార్గులుందురు? వెంకట్రామయ్యకు నేను జేసిన అపకార మేమి? ఎన్నిసంగతులు కల్పించెను! యిటువంటి తెగ మనుష్యులకు ఎవరో ఒకరు కష్టపడుచుండిన తప్ప మనఃశాంతి యుండ దనుకొనెదను. ఈశంకరుడు నాతమ్ముడు. అయినను ఎంతఅన్యాయము చేసెను. ఎంతటి నిర్దయ! మంచిది యిదిఅంతయు మేలే. నాకింతకన్నా కావలసిందేమీా లేదు. నేను చావసిద్ధుడను. నాపై నేరమారోపించి ఉరి శిక్ష విధించి నాకార్యక్రమము మరియూ సులభముచేసిరి. నాకింక యెట్టి చింతయూ లేదు. ఎంత త్వరలో ఉరిదీసిన అంత త్వరలో నాకమలను కలిసికొందును. (అనుకొనుచుండ తలుపులు తీసికొని చెఱకావరి ప్రవేశించి "నా...రా..."అని యేమో చెప్పబోవుచుండ విని లేచి)

నారా—(సంతోషముతో) సమయ మాసన్నమైనదా? చెప్పుము. నాకేమియూ భయములేదు. గుండెలుపగిలి చావను. సంతోషముతో వచ్చెదను. యిందుకొఱకే యిన్నిదినములు వేచి యుంటిని.

చెఱకావరి—అయ్యా! మిమ్మల్ని ఉరి తీయడానికి...

నారా—ఎంతటి సంతోషకరమైన వార్త! రమ్ము, పోవుదము. అచ్చట ఆలస్యమేమియు జరుగదుకదా?

చెఱకావరి—అయ్యా! నన్ను మాట్లాడనియ్యండి. మిమ్మల్ని ఉరితీయం.

నారా—ఎందుకు తీయరు నేను తియ్యమంటూంటె? యిక్కడ కూడ పరియాచకా లేనా?

చెఱకావరి—అయ్యా! మీా అపీలు గెలిచింది.

నారా—నా అపీలు—పొరపాటు—నీకు మతిచెడింది. అప్పీలేమిటి? గెలుచుట యేమిటి?

చెలికా—నాకదంతా తెలియదు. మిమ్మల్ని వదలిపెట్టారు రండి.

నారా—నేను రాను. నీమాటలు నమ్మను. నాకురావలసిన అవునరం లేదు. తియ్యండి–ఉరితియ్యండి. మీకేంనష్టం మధ్యలో? నన్నేం చేసినా రాను.

చెలికా—మీకు పిచ్చెక్కింది. నేనువెళ్ళి సహాయము తీసికొనివచ్చి బలవంతంగా బయటకుపంపుతా. ఓరేయి! రండిరా. (అనగా సహాయకులు ప్రవేశించెదరు.) యీయన్ని బలవంతంగా బయటకు పంపాలి రండి సాయంపడదాం.

నారా—బాబూ వద్దు. వద్దు. దణ్ణంపెడతాను. మళ్ళీ నాకా శూన్య ప్రపంచం చూపించొద్దు. నామాటవినండి.

చెలికా—చూస్తారేమిటీ! (అన సహాయకులు నారాయణరావును బలవంతముగా గొనిపోవ ప్రయత్నించెదరు.)

నారా—నేనురాను. నన్ను చంపెయ్యండి. మీకెవ్వరో నన్నిలా వదిలిపెట్టమని లంచమిచ్చినట్లున్నారు. అధికారులకు తెలిసిన ముప్పు. పిచ్చిపనులు చేయకండి.

(సరకుగొనకయే యెల్లరు నారాయణరావును బయటకు గొని పోవుచుండ నారాయణరావు) కమలలేని బ్రతుకెందుకు? ఉరి తియ్యండి. నేనేం విచారించను. నేను నిజంగా చంపాను. తప్పకుండా తియ్యండి. మీ కనుమానంగా ఉంటే నన్నిక్కడ వదలిపెట్టి విచారించండి. మళ్ళీ బయటకువెళ్ళిన మీకందుతానో? అందనో? (అనుచూ, పెనగులాడుచు పోవుచుండ తెఱపడును.)

రంగము 4.

(శంకరరావుఇల్లు. డ్రెస్ వేసికొనుచూ శంకరరావు ప్రవేశము.)

శంక—(తనలో, మొత్తానికి జడ్జీఉద్యోగం మంచిదే గవర్నమెంటువారు fat salary (పెద్దజీతము) యిస్తారు. మంఖర్చుకి It is nothing. (అది చాలదు) కాని heavy bribes (పెద్ద లంచాలు) కూడ secret (రహస్యంగా) అందుతూంటాయి. నాలాంటి వాడికి దాంతో income and expenditure equate (జమాఖర్చు సరిపోయి) అయి, budget balance (బడ్జెట్టుబ్యాలెన్సు) అవుతుంది. ఓస్పెషల్ ఎడ్వాంటేజి, మన కెవరి మీదేనా grudge (కోపము) వుంటే డొక్క బద్దలు గొట్టొచ్చు. యీవుద్యోగమంత మంచి weapon for revenge (అయుధం పగదీర్చుకోటానికి) మరి లేదు. ఈ month (నెల) చాలా expenditure (ఖర్చు) వుంది. ఇంగ్లండులో లవ్ యఫైర్ సెటిల్ చేయడానికి, నా private property (ఉన్న ధనము) అంతా ఖర్చయింది. Salary (జీతం) వచ్చిన రోజే, రోషజ్జాజ్ వచ్చి Complete (పూర్తి) గా లాగేశింది. వద్దంటే కోపంవచ్చి పోతుందాయిరి. అది లేక పోతే I will become mad. (నాకు పిచ్చెక్కుతుంది) One year (ఏడాది) మట్టి rent (అద్దె)యివ్వడంలేదు. వెంకటాద్రి మయ్యే గనుక, ఎక్కువ interest (వడ్డీ)తో నోటువ్రాస్తే ఊరుకొంటూన్నాడు. రిఫ్రెష్‌మెంటు రూమ్ అకౌంటు మొన్నటి Gala party (గొప్పవిందు) తో చేరి షుమారు రు 1500 లు బాకీవుంటుంది. వ్రాసిన నోట్లుతాలూకు వడ్డీ లకు అసళ్ళని, వసూళ్లని చంపుతున్నారు. These nasty money-lenders (యీపాడు అప్పులవాళ్ళు) అబ్బా! which fool invented this money? (యీడబ్బు

ఏవిధవ కనిపెట్టాడో) యీాచిక్కే లేకపోతే యేకష్టమూా వుండదు గదా! నాలాంటి expenditure (ఖర్చు) వున్న వాడికి, ఏ money manufacturing monopoly (డబ్బు తయారు చేసే అధికారమో) పడేయు గూడదు! యింతకీ That fool of a Brahma has no brains. అందుకనే వాణ్ణెవ్వడూ Worship (పూజ) చేయరు. ఒరేయ్ బాయ్! వాటీస్ దిస్? బ్రాందీకివెళ్ళిన వాడింకా రాలేదు. I can't understand this delay. (యీాఆలస్యం ఎందుకో నాకర్థమవడం లేదు) బాయ్! బాయ్!! (తెలుగులో సార్, సార్, కమింగ్. వరుగునరాగా) Come on! (కమాన్) బాటిల్ ఓపెన్ చెయ్యి. కోర్టుకు వేళఅవుతూంది. యింత ఆలస్యం చేశావేం.

Boy — (భయముతో) Sir, రిఫ్రెష్‌మెంటురూమ్ వాడు బాకీ settle (సరి) చేస్తేగాని ఒక పెగ్గయినా యివ్వ నన్నాడు.

శంక — What! ఎంత audacity? (ఏమిటీ! ఎంత తలపొగరు!)

Boy — వెనకాలే వస్తూన్నాడు. డబ్బివ్వకపోతే suit (దావా) కూడ file (దాఖలు) చేస్తాడట.

శంక — I see. (ఆలాగా?) wait a bit, go and get my car. (సరే తొందరగా కారుతీసుకరా.) I will teach the fellow a lesson (పీచపని పట్టిస్తా) (అనుచుండ తెలుగులో Sir, టెలిగ్రాం.) (బాయ్ బయటకువెళ్ళి టెలిగ్రాంతెచ్చి చేతికివ్వ ఆతురతతో విప్పి)

శంక — (చదువును) You are suspended until further orders. Hand over charge to (యు ఆర్ సస్పెండెడ్ అంటిల్ ఫర్దర్ ఆర్డర్సు హాండ్ ఓవర్ చార్జి టు) ...... Suspended........until........further........orders............

What is this ? Is this a joke ? (ఏమిటీ యిదంతా వేళా కోళాలా ?) I am suspended (ఐ యామ్ సస్పెండెడ్) No ! (నో !) యిదినేను నమ్మను. నన్నెందుకు సస్పెండు చేస్తారు ? Never ! (నెవర్ !) Never ! (నెవర్ !) ఒకవేళ నిజమేనేమో ! What to do? (యిప్పుడేం చేయాలి) How to get on. (ఎలా గడపటం ?) యిప్పుడేం చేయాలి ? నాదగ్గర దమ్మిడీ లేదే ? (రిఫ్రెష్మెంటురూమ్‌వాడు ప్రవేశించి)

రిఫ్రె-రూ—సార్ ! మా డబ్బు.

శంక—మీా డబ్బు ? తరువాత రండి.

రిఫ్రె-రూ—తరువాత వీలులేదు సార్. You must pay now. (యిప్పుడే యివ్వాలి.)

శంక—Must (తప్పదు) I can't. (నేను యివ్వలేను.)

రిఫ్రె-రూ—ముందర కక్కవయ్యా ! నీబాబు సొమ్మనాయేంటి తెగ తాగావు ? ఉద్యోగం వూడినా వదలలేదు దర్జా.

శంక— (తనలో) How does this fellow know? (వీడికెలా తెల్సింది ?) (ప్రకాశంగా) అరేయ్ నాదగ్గర డబ్బేంలేదు. చాతయింది చేసుకో !

రిఫ్రె-రూ—గతిలేనివాడవు యీాడాబంతా ఎందుకు ?

సుబ్బారావు—(ప్రవేశించి) మానేటుకు రావలసిన బాకీ.

శంక—యేమయింది ? What happened to it?

సుబ్బా—యిచ్చుకోవాలి.

శంక—ఎవరు ?

సుబ్బా—తమరు !

శంక—లేదు నాదగ్గర.

సుబ్బా—యీాయక తప్పదు.

శంక—యేం జేస్తావ్ ?

సుబ్బా—చూస్తావుగా. యేమిటోయ్ యింకాాగప్పాలు.

వెంకటాద్రియయ్య—(ప్రవేశించి) అడ్డమాట వేం జేశావ్?

శంక—వచ్చావు! I am waiting for you. (నీకోసమే చూస్తున్నాను)

రాజు—(ప్రవేశించి) యిన్స్యూరెన్సుపీరియం ఓవర్ డ్యూ అయింది. తప్పకకట్టాలి.

శంక.—My lord! సందట్లో సంధి మంత్రం. నాకు అందరికంటె యీ డబ్బెట్టి కొనితెచ్చిన తద్దినం. యీ యిన్సూరెన్సు ఏజంటుగాడి మాటలకి ఒళ్ళు మండిపోతుంది. (రాజుతో) Get-out you fool! (గెట్ అవుట్ యూ ఫూల్)

రాజు—జాగ్రత్త! యేజంటు గీజంటు అన్నావాంటే. నేను బాగ్రించి మేనేజరును. Defamation (మానసష్టందావా) వేస్తా.

శంక—You do your worst. I am prepared. (నీ చేతైంది చేసుకో. సిద్ధంగావున్నా.)

రంగారావు—(ప్రవేశించి) రోషణ జాణగొలుసు...యిదేమిటి హడావిడి?

వెంక—అబ్బే యేంలేదు. గొలుసు సంగతే ఆలోచిస్తున్నాడు. మెడకా? చేతులకా? అని.

శంక—కాదు. నీనోటికి. You are the cause.(యిందంతా నీచలవే.)

వెంక—"మొగుడుమొత్తినందుకు కాదుగాని తోడికోడలు దెప్పినందుకు యేడుస్తున్నా నన్నదట" నీలాంటి ఆవిడే, పిచ్చగామాట్లాడకోయ్.

శంక—యిప్పుడు setting (సెట్టింగు) అంతా కంప్లీటు అయింది. యిలాంటి situation (సంఘటనము) యేకథలోనూ, యేకల్పితంలోనూ ఉండదు. Truth is stranger than fiction! (నిజం కల్పితంకంటె వింతగావుంటుంది) యిటువంటిది కథైతే

యెవ్వరూ నమ్మరు మళ్ళీ యిలాంటిఛాన్సు దొరుకదు. చూడండి బాగాచూడండి. బాబూయింకా యెవరైనా మిగిలారా?

Boy—సార్. నాజీతం సంగతి?

శంక—I will pay. I will surely pay. (తప్పకుండాయిస్తాను.) తప్పుతుందా! నారక్తముతో చెల్లిస్తా! యేముంది నాదగ్గర? I have nothing. This is my due. (నాదగ్గరేమీలేదు. మంచి శాస్తి జరిగింది.)

అందరు—మరి మా అందరిమాట?

వెంక—ఉత్తమాట!

రిఫ్రి-రూ—ఏయ్! కక్కవయ్యా! మాడబ్బు.

సుబ్బా—మావడ్డీ చచ్చినట్లిచ్చుకో. రశీదిస్తాం.

రాజు—నీపాలసీ ఫార్ఫీట్ చేయిస్తా. if you don't pay.

రంగా—నాసంగతి యేంజెప్పావ్. కొంచెం సర్ది పంపకూడదూ?

వెంక—ముందు నా అద్దె.

Boy—నాజీతం.

శంక—డబ్బు! డబ్బు!! డబ్బు!!! వడ్డీ! forfiet, గొలుసు, అద్దె? జీతం? నానెత్తి! మీనెత్తి! గాడ్దెకొడుకుల్లారా! యిస్తారండి. యిది డబ్బు! యిదిగొలుసు! యిదివడ్డీ! యిదిఅసలు! (అని ఒక్కొక్కని గుద్దుచుండ సగంమంది పారిపోవుదురు. మిగిలినవారు దూరమున నుందురు) నన్నింకా అడుగుతున్నారా? అదిగో వాడితల! నారాయణరావ్ తల, నామీదపడుతోంది. పడుతోంది! అన్యాయము! అక్రమము! అత్యాశ! అవినీతి! అజ్ఞానము! అత్యాచారము! అరాజకము! అన్నిటికి నేను-నేనే! నేనంటేనేనే - చూడండి! (తనజుట్టుపట్టుకొని) యిదిడబ్బు. (చొక్కాచింపుకొని) యిదివడ్డీ. (నెత్తిబాదుకొని) యిది అద్దె.

వాడుఫార్ ఫీట్. నువ్వుజీతం. నేను ఉరిశిక్ష. మీరు సాక్షులు. ఇది పాపం; ఘోరం! దోషం. డబ్బుతగలేశా! తాగాను! వ్యభిచారిని; జారుణ్ణి; చోరుణ్ణి; మోసగాడను; చివరకు హంతకుడను! చేసిన పాపానికి, శిక్ష అందరూ అనుభవిస్తారు. నరకం బయట లేదు. పాపపుణ్యాలఫలం యిక్కడే అనుభవించాను. నవ్వండి బాగా! నాకొఱకొక కన్నీరైనా రార్చవద్దు. తన్నండి! కొట్టండి! కుక్కలచే యీడ్పించండి! నరకండి! కాల్చండి! మీ యిష్టం, యేంచెయ్యాలో చెయ్యండి. కానీ, ఆ తలకాయ! వద్దు. అదిగో! నారాయణరావు చచ్చి సాధిస్తున్నాడు. వస్తోంది! వస్తోంది!! తలకాయ! తలకాయ!! (అనిపారిపోవుచుండ తెరపడును.)





# పశ్చాత్తాపము.

## అంకము. 7

(నారాయణరావు కమల కూర్చొనియుందురు. కమల నారాయణరావుకు తమలపాకు లందిచ్చుచుండును.

నారా—పాపం. శంకరం పోయి యిప్పటికి యేడాదయింది. దిక్కులేక, తిండితిప్పలులేక, కుళ్ళి, కొట్టుకొని, దుర్మరణం పొందాడు. పాపం నేవెళ్ళిందాకా శవాన్నైనా దహనం యెవ్వరూ చేయలేదు. కుళ్ళి పురుగులు, రాంబందులు, నక్కలు పీక్కొని...

కమ—అబ్బా మళ్ళీ తలవకండి. ఒళ్ళు జలదరిస్తూంది.

నారా—పాపం. వెంకటాద్రియ్య కుష్టురోగంతో తీసికొంటూన్నాడు. డబ్బంతా ముండ కాజేసింది. యెంత అవస్థ!

కమ—పాపం. అబ్బా! మఱచిపోదాం ఆపాడు సంగతులు, చెడ్డరోజులు.

నారా—అలాగేలే!

కమ—అదంతా కలేమోనండి!

నారా—ఆలాగే అనుకొందాం. అయిపోయిన సంగతేకదా. (అనుచుండ గోవిందరావు మహాలక్ష్మి ప్రవేశము).

మహా—మనచిట్టి యేడే! అమ్మాయీ?

కమ—పడుకొన్నాడమ్మా! లోపల.

గోవిం—అప్పుడే యెందుకు పడుకోబెట్టావే వాణ్ణి?

కమ—యేంచేయను నాన్నగారు, ఊరికే అల్లరిచేస్తున్నాడు.

ప్రసా—(ప్రవేశించి) కమలా! అలాఅంటే నే నొప్పుకోను.

గోవిం—భావగారూ! యింతసేపూ యేంజేస్తున్నారు?

ప్రసా—అబ్బే! లోపల పనిమీదవున్నా.

గోవిం—యేం పని?

కమ—యేంలేదు. మనమడ్ని వూపడం.

(అందఱు నవ్వెదరు)

ప్రిసా—గట్టిగా నవ్వకండి. కుర్రాడు లేస్తాడు.

మహా—అన్నగారూ! యెంత అపురూపమండీ!

ప్రిసా—వాడికన్నా యెక్కువా? లేస్తాడేమొ! వస్తా. (అని వెళ్ళి తెఱ లోనుండి) బావగారూ! అమ్మా మహాలక్ష్మమ్మా! అమ్మాయీ కమలా! ఒరేయి అబ్బాయి! రండి. చూడండి, యెలా పడుకొన్నాడో మనవాడు, దర్జాగా!

(గోవిందరావు మహాలక్ష్మి 'యేడీ' అని లోనికి వెళ్ళుదురు).

నారా—ఆహా! యెంత మంచిరోజులు?

కమ—తప్పకుండా! చిట్టి పుట్టినప్పటినుండి అంతా అదృష్టమే. యింతకీ కష్టాలు పుట్టికట్టుకొని వుండవు. మంచివాళ్ళ నెప్పుడూ శిక్షించడు దేవుడు. మన సంతోషం అందరికీ యిస్తే యెంతబాగుంటుందీ దేవుడీలాగే!

నారా—మనంకూడ వెడదాం రా లోపలికి.

కమ—రోజూచూస్తున్న వాడేగా! యిప్పుడేంకొత్త?

నారా—అదేంమాట! యెప్పటికప్పుడే కొత్త!

కమ—అవునులెండి. యికమీకొడుకుని చూచి మురిసిపోతూ కూచోండి. మఱి నే నెందుకు?

నారా—నాకొఱకు. రా. ...

కమ—అబ్బా! ఏంమాటలండి? ఎవరేనా వింటారన్నైనా...

నారా—ఫరవాలేదు. అంతా మనవాళ్ళేగా!

కమ—ఊ! పోనీలెండి వేళాకోళాలు. చిట్టి యేడుస్తాడు, వెళ్ళాలి. (అని పోబోవుచుండ నారాయణరావు! యిదిగో! యిదిగో! యేదిముద్దు? అని వెంబడించును. తెఱఎత్తగా ఉయ్యాల తొట్టివద్ద కమల, నారాయణరావు మొదలైనవారు నిలచియుందురు. కమల పాడుచుండ తెఱపడును.

మంగళమ్.

#  మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B103 |
| పుస్తకం పేరు | పశ్చాత్తాపము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 73 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | ,B,4,6,62, |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |